# వే మ న

## వే యి ప ద్య ము లు

విద్వాన్
**బండ్ల సుబ్రహ్మణ్య కవి**



మూల్యము **2-50**

విళంబి

శరత్తు

ప్రథమ ముద్రణము ౩౬౦ పద్యములు - ప్రతులు ౧౦౦౦

ద్వితీయ ముద్రణము ౧౦౦౮ పద్యములు - ప్రతులు ౧౦౦౦

సారస్వతనికేతన ప్రింటింగు ప్రెస్

వేటపాలెము

1958

# పరిచయము

కవిత్వ మొకరి సొత్తు గాదు. కాదని యొకానొకఁ డన్నను నది గ్రాహ్యము గాదు. కవితాశక్తి వ్యక్తిగత ప్రజ్ఞను వెలార్చుచుండును. ప్రజ్ఞాశాలి కాకపుడు వీలులేక భాషాభాగ్య మబ్బక పోవచ్చును. కాని, యది యతని ప్రజ్ఞ నేమాత్రము కప్పిపుచ్చఁ జాలదు. ప్రతిభ లేని భాషాపాటవ మంత ప్రశస్య మనిపించుకోదు. చాలమట్టు కీతూక మన్ని యెడలఁ గుదురకున్నది. ఉన్నచో నది వ్రేళ్ళమీఁద లెక్కఁ బెట్టవలసినదే.

ఒకఁ డింత సామగ్రితో నూటలూరు కవిత్వ మల్లును. మఱొకఁ డెంతో సాధన సంపద గలిగియుఁ బులుముడు ప్రారంభించును. ఇంతైన నంతైన ముకుసూటిగాఁ జెప్పు భాగ్య మందఱకు లభింపదు. చెప్పినను నందలి జీవకళమాత్ర ముపజ్ఞా మహిత మనక తప్పదు. దీనికి మన వేమనాదులే తార్కాణము.

వేమన భోగయోగము లడుగుమోవఁ జవిచూచిన రససిద్ధుఁడు. ఆకాలమున నతఁడు వాకొని యూఁకొట్టింపని లోకమే లేదు. అందుచేఁ దన్ను వశ్యవాక్కున నెత్తిన పెట్టుకొన దగినదీ లోకమే.

ఇం కతని జీవిత ముపవర్ణింప లేదు. అది చరిత్రకారుల పని. కళాతపస్వి కావాసన గిట్టదు. కట్టు కథల క్రిందికి దిగి "తన జన్మ వసుంధర నిర్ణయింప నాఁడెందము సమ్మతింప"

దని మన కవి ముద్దుముద్దుగాఁ జెప్పుకొనుచున్నాఁడు. అయినను తని జీవితశకలములు మసిముట్టక పోలేదు.

నాసాగ్రమున దృష్టి నిలిపి మోఁకాలి కుటికివంగి [illegible] గట్టివలె నున్న వెట్టివేమన్నను బ్రసాదించిన నీశిల్పిలోకము ఆరూపమునే విశ్వమెత్తుకొన్నది. దానినే కవి మన దృష్టికిఁ దెచ్చినాఁడు.

ఇందలి యెత్తుగడలోని ప్రాంత మందలి కందుపాటులో నుండునది కాదు. ప్రస్తుత వస్తువు కనుగుణముగా నిందలి ప్రకృతి విశ్వరూపము దాల్చినది. ఒకచోఁ గసుడుగట్టిన కాటుక కాయయై వేరొకచోఁ జిలుకముకు మామిడిపండు లాగునఁ గళలు చిందినది. అందుచే నిది సుదూరము నడచినను ఆపాతరమణీయముగానే యున్నది.

అసలు ప్రకృతిసుందరుఁడైన కవికి ఆంతరికదృష్టి హెచ్చు, తా ననుకొన్న దింత లింతలుగా గీతించును. మన బాహ్యదృష్టి కదొక నైకముగాఁ దోఁపవచ్చును. రసలుబ్ధులైన కవులీతన్మయత దక్కఁ గాణింపలేరు. అందుచే వారంతగాఁ గథావస్తువు ప్రాంతఁబోక పద్య మొక ప్రబంధముగా దిద్ది తీర్చుచుందురు. వారి ఛాయ లీప్రకృతిలో నెల్లెడఁ దోఁగి చూచినవి.

బ్రహ్మముగారికి సిద్ధప్పవలె అభిరాముఁగుణుని ద్వారా శివయోగి కినేఁడు శిష్యుఁడై – అభిరాముని పేరమర మొసర్చి నాఁడు, తెలుఁగు వేదాంతుల కీ వేమనాదు లాదర్శశిఖరాలు.

తరువాత వచ్చిన చాగంటివారు, చేమకూర వారు తచ్చాయల నూఁది కులపతులు కాఁ జొచ్చిరి.

వేమన వినా తక్కిన తెగల వా రనిబద్ధచ్ఛందమునఁ దత్త్వములద్వారా తమ విజ్ఞానప్రసారము సేయఁ జొచ్చిరి. వేమన్న మాత్రము "బ్రహ్మమునుజూచి లోకుల భ్రాంతిఁ జూచి" ఆటవెలఁది నెగవిడిచినాఁడు. ఆ "విశ్వద" జగ్గు నిగ్గు లిందులోఁ బట్టుకొన్నఁ బరిమళించినవి. ఆ వీణానిక్వణ లీనరాగకళ లిందులో విజ్జిరాలినవి. అందుచేతనే వేమన్న ఆటవెలఁది కింత గిరాకీ హెచ్చినది.

తలపోఁతలో రామ రహీము లొక్కఁడన్న మహాత్ముని నిర్వచనము చక్కఁగా సమర్థింపఁ బడ్డది. ఖయాము, కబీరుల తేడా, బుద్ధభగవానుని త్యాగమహిమ మిం దుటంకింపఁబడ్డవి. ఇం దుపవర్ణితములైన విషయాలేకవి భావనాశక్తికి వ్యాఖ్యాన పాత్రములు.

శ్మశానవాటికలోఁ జిందు నుడుకు నెత్తురు, భర్తృవియోగాగ్ని, పుత్రశోకార్చి, పితృదహనము, మిత్రదుఃఖజ్వాల లేకమై చితాభస్మవేదికఁ దాండవించినవి. కళలు కన్నీటితో జలాంజలు లొసఁగినవి. ఇఁక మిగిలిన దేది? మృత్యుదేవత కోఱలలోని మెఱపు? — ఈ మెఱపులో మన విశ్వసన్న్యాసి కుండలిని జిక్కఁబట్టి అష్టసిద్ధులు లోఁగొన్నాఁడు. సృష్టివైవిధ్య ముపచరించు బ్రహ్మము నెత్తి చూపినాఁడు.

ఇట్టి రససిద్ధుని కవీంద్రుఁడనకున్న మునిఁగిపోయిన దేమి? మణఁగిపోయిన దేమి! అందతుకుల బొంతలన్నను నస కున్నను నితఁ డమరకవియే యని మన కవి తృప్తుఁడైనాఁడు.

"తిట్టించు కొన్నవాఁడే గట్టిగ నవ్వినపుడు" "నోరు గలుగు తెలుఁగు వారెల్లఁ దన పద్యములు వల్లె వేయుచు న్నప్పు" డీశంకకుఁ దావెక్కడిది? ఎవరే నన్న నది కసినోక్క కొసిగొట్టుకొను మాట.

పైఁగాఁ గారణ విమర్శనాశక్తి గలిగి నెఱకులు గాడి కత్తితో నుత్తరించినట్లు గనిపించు కవిత్వము తెలుఁగు వెన్నెల బయళ్ళలో నడయాడుటకు జంకునా? కొంకునా?

నాఁటి పండితులు కబీరు ప్రభృతులకు బలె నీతనిని నూపక పోలేదు. ఊపిన నేమి! "విన్న మాకుఁ గన్న మాకుఁ జర్చ లేమిటయ్యా" యని వారిని జోకొట్టి విడిచి నారు. పరుల యున్నతి కుడికి మిడుకు శతాత్ములు కామక తెగులు లేని వేదనపడి తీఱెదరు. వారుపేక్షా మాత్ర దండ్యు లని యీ కవి మతము. అయినఁ దీయసి నోరఁ జేదుమేయు నాపలఁ జెంతనాడిన ఫలమేమి?

తమిళ కన్నడములలో వేమనార్యున కుజ్జీయైన వా రొక తిరువళ్ళువరు, సర్వజ్ఞుఁడని తజ్ఞు లందురు. తెలుఁగున మాత్ర మతని కతండె సాటి యని పలువుర యభిప్రాయము. కాని అలఁతి యలఁతి పల్కులం దెంతో భావ మిముడ్పఁగాఁ దిక్కయజ్వ కితఁడు దీటైనవాఁ డని ఈ కవి యభిప్రాయము. భవతు:

తాళిక, బిత్తళి, చాఁడి, పొడ్డు, దుక్కు, బైసి, మంకు. రిమ్మ, బసి విత్యాది పదాలు కన్నడిచూలు – ఈ కవిద్వారా తెలుఁగు పొలాల నెలకొన్నవంమురు.

ఇది అక్క సెల్లెండ్రి పొత్తు – ఎక్కడో మిన్నులు వడ్డచోటిదైన భాషాభేషజ మాత్సర్యముగాఁ దయాళైనపుడీ చెలిమి కబ్రిపడ నవసరములేదు. స్వరూపజ్ఞానము నశింపఁ జేయనిబలువు, వల పొకదినుసు మెచ్చుకోలునకే యగునేమో?

ఇందలి శైలి పాదరసములాగునఁ బసువెత్తినది. భావ ములు కొట్టనచ్చినట్లున్నవి. శయ్యనాలు గంచులు దీరినది. సూక్తులలో బదునాఱణాల తెలుఁగుదన ముట్టిపడినది. ఇంతేల? ఈ సూక్తులన్నియు వేమన్న నోటినుండి యథాతథముగా నూడిపడిన ట్లున్నవి. సూక్తులకు ముందలి ఖండములలోఁ గావ్య మర్యాద లిరవుకొన్నవి. వానిని దిఙ్మాత్రముగా సూచింతుము.

పరిష్కృతిలో ౧౭ వ- పద్యము బట్టుమూర్తిని గుప్తికిఁ దెచ్చుచున్నది. అందలి ౨౭ వ- పద్యము పారిజాతకవి కత్యంత సన్నికృష్టము. సమావేశ కృతిలోని ౨౮ వ- పద్యము సమాసవిస్ఫూర్తికి దటిమెనఁ బెట్టినది. ౧౧ వ- పద్య మునఁ జందన చర్చలు గులుకు నలసాని శయ్యాసౌరభము గుబాళించినది.

తలపోఁతలోని "ఎముక లేర్చుకతిను" నట్టి ప్రయో గములు తేనెపెరలఁబోని తంజాపురి కవుల రచనల బుణికి పుచ్చుకొన్నవి.

"ఔపనిషద వివేకానంద" "మన ఉద్ధతి" మొదలగు ప్రౌఢకవి ప్రయోగము లైచ్ఛికము లనిపించుచున్నవి.

ఇం దడు గడుగున నుప్పతిలు జాతీయపదముల, నానుడుల నెత్తిచూపుట కయితిగానిపని — ఒకటా రెండా ఎత్తి చూపుటకు ? కథావస్తువు లేకున్నను ఈరీతి సూక్తులై చిత్రించేఁ బాలకుల మెప్పించుట అసాధకున కరిది, ఇందు కవికుండవలసిన సాధన సామాగ్రి పుష్కలముగా నున్నది. ప్రత్యూత తెలుఁగు పోడుముల కెల్లయగు జాతీయసంస్కృతి వెల్లుబుకు చున్నది. ఇంతకు సహజసుందరమైన యీకవిత్వమున కన్యుల పరిచయ మనవసరము.

సామెత కామెతయైన ఈ తెలుఁగు నుడికారపు సొంపే భావుకులకుఁ జబ్బన చూఱకాఁగలదు.

— ఏటుకూరి వేంకటనరసయ్య.

# విన్నపము

భారతీయ మహింసాధర్మ మీనాఁటిది కాదు. దాని నొక స్వరూపమునకుఁ దెచ్చిచూపిన బుద్ధదేవుఁడు మనపాలిటి భగవానుఁడు. ఆ ఛాయ లందుకొని ప్రపంచజ్యోతియై వెలుఁగొందినవాఁడు మహాత్ముఁడు. ఆయన ధర్మమున నేఁటికి స్వాతంత్ర్యము లభించినది. అది కారణముగా మన జాతీయదృష్టి వైజ్ఞానికప్రవణమైనది. అన్నింటికన్న భాషాస్వాతంత్ర్యము జాత్యభ్యున్నతికి మూలకందము. కావున, నేఁడు దేశభాషలకుఁ గలిగిన ప్రాముఖ్యము నా కెంతయో ముద్దుగొల్పినది.

రసపిపాసువులకుఁ గళారాధనము నైజమైనది. వారిలో నణుప్రియుఁడనైన నాకుఁ జిననాఁటి నుండియుఁ గవితావ్యాసంగమన్న నిష్టముంటచే నెడనెడఁ బెద్దల ప్రోత్సాహమున నింతనంతఁ జెప్పనేర్చి మూఁడు దృశ్యకావ్యములు వ్రాసితిని. అవి యందంద ప్రదర్శితములై యుత్సాహజనకములైనను శ్రవ్యకావ్యములయెడ మనసు వ్రాలినది.

కొంత సాధనద్వారమున నా బాటలఁ గాలిడితిని. మునుముం దాంధ్రకవి గాయక శిల్పులనుగూర్చి లలితకళాక్షేత్రమను నొక ప్రబంధము వ్రాయఁదొడఁగితిని. దానిలో నొక ఘట్టమే యీ వేమన.

ఆ గ్రంథమును జూచిన మిత్రులు ప్రత్యేక ప్రత్యేకముగా దీనిని వెలయింపుఁడని నాకు సలహానిచ్చిరి. అదియుఁ బ్రచారమునకుఁ గొంత సుకరముగా నుండునని యీ పనికిఁ బూనితిని. నన్నీసులభమార్గమునకు దిగిచిన మిత్రకోటి కెంతయు గృతజ్ఞుఁడను.

తమ పరిచయమూలమున గ్రంథమునందలి భావశ్రీలను పాఠకలోకమునకుఁ బరిచయ మొనరించిన "కవిబ్రహ్మ" శ్రీ ఏటుకూరి వేంకటనరసయ్య గారికిని, ది 6-2-1941 మధ్యాహ్నము గం. 11-30 లకు పరమేశ్వరుఁడు కృతిభర్తగా, శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావు (M.A.) పంతులుగారు సభాధ్యక్షులుగా, 6 వ- దక్షిణభారతవయోజన విద్యా మహాసభలో కృతిసమర్పణమహోత్సవ మత్యంతోత్సాహమున జరిపించి యీ ద్వితీయ ముద్రణమునకుం బ్రోత్సహించి చేయూతనొసంగిన శ్రీ అడుసుమల్లి శ్రీనివాసరావు పంతులుగారికిని, శ్రమయనక చెన్నపురి కరిగి త్రివర్ణచిత్ర సహిత[illegible] [illegible]ను తయారుచేయించిన శ్రీ గొల్లపూడి రాధాకృష్ణయ్య శాస్త్రి గారికిని, ముచ్చటగ నచ్చొత్తించి యిచ్చిన శ్రీ సారస్వత నికేతన ప్రింటింగు ప్రెస్ వారికిని నా కృతజ్ఞతాపూర్వక వందనములు.

[illegible].



సీతమ భుజంగరావుల జ్యేష్ఠసుతుఁడు
చెలఁగు శ్రీలక్ష్మీధవుఁడు విశిష్టగుణుఁడు
వినుత విద్వత్కవీంద్రుల వేల్పుటావు
వాసికింతావు! మా **శ్రీనివాసరావు!**

ఓం

ఏ పరమేశ్వరుండు జగ
　　మెల్ల సృజింపను బెంపఁ ద్రుంపఁ దా
నోపినొ? యే యనంతుఁడు య
　　థోచితరీతి సమస్తజీవులన్
బాపములన్ దొలంచి నిర
　　పాయ సుఖస్థితిం దేర్చుచుండెనో?
ఆ పరమాత్మ కీ కృతి స
　　మర్పణసేతు నభీష్టసిద్ధికై.



ఏ సద్గురు దయావిశేషమున నాకీవాకు చేకూరెనో
ఏ సర్వజ్ఞ కృపా కటాక్షమున సిద్ధి రూపముం దాల్చెనో
ఆ సర్వాత్మకు పాదపద్మముల కే నర్పించుటన్ భక్తినై
ఈ సాహిత్యలతాగుళుచ్ఛ మెదకెం తేఁగూర్చు నామోదమున్.

పచ్చకప్రపు మొలక లాసలుకుబడులు
పచ్చి కస్తురి వలపు లాభావభంగు
లతి మధుర మాస్వరూప మెట్లన్న నేమి ?
అందచందాలరాణి మా యాంధ్రవాణి.

కను దెఱచి మూసినంతన
కన దద్భుత లీల నాకుఁ గన్పడు లోకం
బనుపమ కవితాలోకం
బనఘులు కవిచంద్రు లిది మహార్థము కాదే ?



# వేమన

## ప్రకృతి

ఈ వనము శాంత ఈరాత్రి ఈ వికార
భూత బేతాళ సంచార భీతిద మగు
ఈ నదీతీర ఘోర శ్మశాన వాటి
మఱ్ఱికిందఁ గనంబడు వెఱ్ఱి యెవఁడు ?

ఊఁడల కూడలే పెరఁగి యూర్జిత సత్వ సమేత మైన యీ
నీడలమఱ్ఱి నీలధరణీధర మోయనఁ దోఁచుచుండు నీ
పాడుబయళ్ళ వట్టిచను పాంథులఁ దేర్చెడు దీనిపై సదా
గూడులఁ గూర్కి బిట్టెగసి కూయు ననేక విహంగసంతతుల్.

కాయ లను నల్లగ్రుడ్లు గ్రక్కదలుచుండ
ఆకు లను పల్లజడలు వ్రేలాడుచుండఁ
దటపటాయించు నీ పెద్దతాటిచెట్టు
బ్రహ్మరక్షస్సు నాఁ గంటఁ బడ్డ దిచట.

పచ్చపైరుల కొంగొత్త వలువఁ దాల్చి
తళుకు బెళుకుల భూదేవి కులుకుచుండెఁ
జేనుగట్టుల బొరియల చెంత నిలిచి
దొంగజపమాచరించు నా కొంగకుటుము.

పిల్లకాల్వలు ముత్యాల పేరులట్లు
క్షేత్రలక్ష్మికి జిగిమీఱు చెలువమొసఁగ
తడిసియుండఁగఁ జలిగాలి తగిలినంతఁ
బుడమి పులకించినది యనఁ బూచె తెల్లు.

సంజ మందేహ దైత్యులు సారసాప్తుఁ
డని యొనర్చుచు విడిచిన యలుగులెన్నొ
కొట్టుకొని పడి భువిగ్రుచ్చుకొనిన వనఁగ
ఏచి యందంద పూచికల్ తోఁచుచుండె.

మండుటెండల నోరెండి మంచినీటి
కొఱకుఁ దపియించు పాంథులఁ గూలఁద్రోయ
నెండమావుల సృజియించి యేచునట్టి
దానమెఱుఁగని వట్టి మైదానమిద్ది.

కారుచిచ్చులాతెఁ గలువలు మిఱిమీఱె
మరుఁడు కత్తినూతె మడుగుదేతె
అసలు పుట్టువూరె నంచపిందులు కేరెఁ
గాలమహిమ కడ్డుగలదె జగతి?

పేద మేకముల నెత్తురు పీల్చు నట్టి
క్రూర జంతుల స్వైర విహార వేళ
పాప మీరూపమున వచ్చి పడిన దనఁగఁ
గాఱు చీఁకటి జగమెల్లఁ గౌఁగిలించె.

కీ లెఱిఁగి గట్టిగాఁ గంచు గీచి నట్టు
లీల కోళులు 'కీ'యని గోల సేయ
గుడ్లగూబలు 'గుఱ్ఱు'ని గోతుకుచుండ
భీతి గొల్పిన దిచటి విభీతకంబు.

ఇదిసమయంబు హింసయో? అహింసయో? లోకమునిద్రగూరియు
న్నది తెలివొందెనా? తగు నాహారము సాగ దీకెట్టులైన నా
మదిఁగల కోర్కె దీఱఁగ నమాంతము పక్షుల దొర్చితింట నా
కది పది వేలటంచునె దివాంధము లేచిన దొక్కపెట్టునన్.

కొలఁది దూరమునం బేర్చు కొలఁకునందు
అలఁతి కప్పలు 'బెకబెక' లాడఁదొడఁగెఁ
బొదలఁ బొదలెడు పిట్టలు పోరుసలుప
వాని ఱెక్కలసడికి నవ్వులను కలఁగె

ఘోరతమమున బ్రహ్మాండ గోళమంత
కరుడుగట్టిన కాటుకకాయ యయ్యెఁ
గొఱవి దయ్యాలబలె మిణుగుఱు లెసంగఁ
జుక్క లొయ్యొయ్యఁ మార్గము సూపుచుండె.

పీన్గుపెంటల కటునిటు పెనఁగులాడి
నక్క లొకచోట గుమిగూడి దిక్కు లద్రువ
నూళ పెట్టుచు నున్న యీ కాళరాత్రి
నెట్టు లుంటివో? యిచ్చోట నెఱఁగియెఱఁగి

యోగసమాధిలో మునిఁగియుండి పరాత్పరుఁ జూచుచున్నయీ
రాగవిదూరుఁ డెవ్వఁడో? పరాకుగ నీతనిఁ బల్కరించితిన్
భోగియుఁ ద్యాగియున్ బరమపూజ్యుఁడు నామన వేమనార్యుఁడా?
ఆగెదఁ గొంతసేపు మనసారఁ దదీయ దిదృక్షు నారయన్.

విన్ననెఱు మల్లెపందిటఁ జెన్నుమిగులు
చిన్నమొగ్గలు కగ్గని పెద్దమొగ్గ
లనఁగ నక్షత్రములు లెక్క కలవిగాక
మిన్కుమిన్కని మినుచక్కి మెఱయుచుండె.

హృద్యత్కృత్యుఁడు సృష్టికర్త రజతాద్రిం జేసి గంగాఫగన్
సద్యశ్శ్రీ నలరారుదానిగని పెల్చన్ గాలయంత్రాన ద
ద్విద్యుత్తున్ గొనివచ్చి నేను పొలయన్ విన్వీధి వెల్గించెనా
విద్యుద్దీపశిఖావితానముగ నొప్పన్ దారకానీకముల్.

అబ్జకిరణాలు భక్షించి యాకసమున
స్వేచ్ఛఁ దిరుగు చకోరమ్ము లెడలవిడుచు
రెట్టలోయన 'జెకుముకి' కొట్టినట్టు
లుల్క లందంద గాలిలో నురలఁజొచ్చె.

ఉడుతచేఁ గొంత చవిచూడఁబడిన లేఁత
చిలుకముకు మావిపండునాఁ గళలుచిందు
నర్ధచంద్రుఁడు దోఁచి తెల్లైనపిదప
నల్లవాఱిన జగమెల్లఁ దెల్లవాఱె.

దివిని సుధ ద్రావుచుండిన దేవవిభుని
చేయి జాఱుటచే రెండు చెక్కలగుచుఁ
బగిలిపోయిన పింగాణి పళ్లెమనఁగ
మింట జాబిల్లి సగమయ్యు మెఱయుచుండె.

హరిపదమ్మను నిర్మల సరసునందుఁ
దెల్లఁ దామరలనఁ జుక్కలెల్లఁ దనరె
నొడ్డునందోఁచి మఱియొక యొడ్డుజేరు
రాజహంసము నా నలరారె రాజు,

గగనమను నల్లబల్లపైఁ గాలగురుఁడు
సగము భూగోళపటమును సరిగగీచి
మిట్టపల్లములను గుర్తుపెట్టె ననఁగఁ
దెలుపు శశియందు హెచ్చుతగ్గులుగఁ దోఁచె.

ఉదయ మెడసేయ కబ్ధిలో నుదకమాడి
విష్ణుపదమంటి యీశు సేవించి యతఁడు
లలిత తారాయుతుండయి కులికె ననఁగఁ
బీచుమబ్బుల తెరల దోఁబూచులాడె.

ముదుసతమంబుగో నణఁగిపోయిన లోకము నుద్ధరింపఁగా
నొదవెను రాజు, రాజకళ యుట్టిపడఁగ సమత్వశీలుఁడై
సదయుత సర్వజీవులను శాంతరసమ్మున ముంచి తేల్చుచున్
హృదయము కందిపోనడచె నిట్టివె సద్గుణరాజధర్మముల్.

మేడపై పూలపాన్పున మెఱయుచున్న
లచ్చిగల యింతి కేసుఖ మిచ్చినాఁడో ?
నేలపై నెత్తికొంగున నిదుర గూర్చు
బిచ్చగత్తెకు నాహాయి నిచ్చినాఁడు.

జనకుఁడు రత్నాకరుఁడని
తన పేరు సుధాకరుఁ డని తగ వెఱిఁగి బుధుల్
మనుపు మని యాశ్రయించినఁ
దనువునఁ గల యమృత మతఁడు దానము సేయున్.

భవుని తల మల్లెచెండు— దేవతలపండు—
కాలపురుషుని కన్ను— పాల్కడలి జున్ను—
కలువ చక్కిలిగింత— దొంగలకుఁ జింత—
అందచందాలసీమ— మాచందమామ.

ఆత్మ మదనాగ్నిఁ జల్లార్పఁడని తలంచి
ఈ కళానిధిఁ జూచి సహింపలేక
విరహిణుల్ తిట్టి మెటికల విఱుతురార ?
సర్వజన పూజ్యుఁడగు వాఁడు జగతి లేఁడు .

చంద్ర! నిన్నవలోకించు సమయమందు
'వరదగుడి' వన్నెచిన్నెల వంకఁజూడ
ఎంత సంతస మబ్బునో యంతకంటె
నధికతరమైన సంతోష మావహిల్లు.

ఇనుప గజ్జెల తల్లి వసించు గృహము
రక్తి జెడియుండుఁ జీఁకటి రాత్రివోలెఁ
పద్మ దయతోఁ గటాక్షించు వాని గీము
రమ్యముగ నుండు వెన్నెల రాత్రివోలె.

దూది గుట్టలు గాలిలోఁ దూలిపోవు
చున్న విధమునఁ గన్పడుచున్న వచ్చ
మబ్బుతునుకలు తనశక్తి మాసిపోవ
సృష్టిలో దేనిగతియైన నిట్టిద కద!



## సమావేశనం

బ్రహ్మమును జూచి లోకుల భ్రాంతిఁ జూచి
పలుకుచున్నాఁడు కమ్మని పద్యములను
తపసితో మాటలాడఁగాఁ దగిన వేళ
ఇదియ గావున నే సమీపింతు నింక.

వేమన యోగీశ్వరు లా
స్వామీ! పొరపాటు తప్పు, క్షమియింపుఁడు మీ
కోమల దేహము వసచెడ
నేమీ? గుర్తింపఁజాల కే నిట్లంటిన్.

బంగరు పూవుటూయెల సెబాసన నూఁగుచు నున్న వాఁడు రా
జ్యాంగనఁ గూడి వేడ్కమెయి నచ్చట నీదు సహోదరుండు; త
త్సంగతి కేమి? నీ విట శ్మశానభయానకవీధిఁ జిత్కళా
రంగము నేలుచుంటి వవురా! యనుజన్ముల భేద మిట్టిదా?

అధికార గర్వ మెఱుఁగఁడు
బుధులన్నం బ్రాణమిచ్చుఁ బురజనులను సత్
పథమున నడపం జూచును
బెద వేమన సాటి నృపులు పృథివిం గలరే?

తెలుఁగుం గబ్బములన్ రచించి శుభ సందేశంబు లాంధ్రావనిం
జెలఁగం జేయుచు రాజ్యపాలనమునం జేదోడువాదోడుగా
మెలఁగంజాలెడి తమ్ముఁ గుఱ్ఱవని నమ్మెంగాని యీ రీతిగా
నిలభోగంబులఁ ద్రోసిపుత్త్రువని భావింపఁడు తానాత్మలో.

నీతిపునీత 'విశ్వద' మణీమయసౌధ వితర్ది నుండి యుం
జేతము నీపయి న్నిలిపి చింతిలు చున్నటు లున్న దింతిపన్
లేఁత గులాబిపూవుల బలెన్ జిగి గూరెడు మేల్మి బుగ్గలన్
ద్యోతక మయ్యె మౌక్తికము లోయన జాఱెస యశ్రుబిందువుల్.

ఎంచి విరించి చెద్దుమున కేడ్చి తపించి విపంచి మీటిన
ట్లించుక సంచలించి నినదించుగళమ్మున మూఁగరాగ మొ
క్కించుక రేఁగి రేలఁ దమకించి యొడల్ చెమరింప నీకునై
కాంచన కేతకీకుసుమగాత్రి బయుళ్ళను గౌఁగిలించెదుర్.

ఆమని లేఁ జివుళ్ళు దిని హాయిగఁ గోయిల కూయుచుండఁగాఁ
బ్రేమ సుధాస్రవంతి మురిపించెడి భావతరంగలోలహా
కోమల సౌఖ్యనాకపయిఁ గోమలి, నీవు రసైకలోలురై
ఏమనుకొంటిరో తిరిగి యేక్రియఁ బాసి చరించుచుంటిరో.

ప్రణయ మానసమున రాజహంసల భంగి
నీఁదు లాడి నట్టి దృశ్యమిప్పుఁ
డాకె కింక మఱపు రాక చీకాకునఁ
గుందుచున్న దురక డెంపమందు.

సహజసౌందర్య సౌహార్ద్ర సామరస్య
మహిత నాయికా నాయకాత్మజ విలాస
మది రసాయన సమ్మేళమగును, గాని
భౌతికపు మిశ్రమముగాదు త్వరగ విడిగ.

చందనచర్చలం గులుకు సాని మొగమ్ము కళావిహీనమై
కందిన దంతులై ముఖముఖమ్ములు సూచికొనందొడంగి రం
దంద చెలుల్ పటీరజల మాకెపయిన్ జిలికించుచుండి రా
కొందల మేమిచెప్ప; నినుగూర్చి తపింపని తావులే దటన్

ఖండ శర్కర నోటినిండఁ గ్రుక్కెడ నీక
పలుకవే యొకమాఱు చిలుక నీవు
బంగారు గజ్జెలు పాదాలఁ జుట్టెద
నృత్యమ్ము సేయవే నెమ్మి నీవు
తియ్యని పండ్లను దినిపింతుఁ గొంగొ్రొత్త
వార్త సెప్పవె గోరువంక నీవు
కొదమ తామరతూండ్లు ముదమార నొసఁగెద
నటునిటు తిరుగవే హంస నీవు

అంచుఁ జెలులైనఁ బులుఁగుల నాడరేల
పులుఁగులైనను గవగూడి కులుకవేల
భోగవతిపాలఁ బడిన వియోగ రసము
చేతనాచేతనములందుఁ జిందె నేమొ.

తానే తావకరూప మాసపడి తోల్తన్ నిన్నుఁ బ్రేమించెనో
యా నారీమణిరూప మాసపడి నీ వాసించితో మీ మనో
వీణానిక్వణలీనరాగకళ కీ విశ్వంబు విభ్రాంతమై
మ్రానైపోయిన దీదృశప్రణయ సామ్రాజ్యంబ దిట్లయ్యెనా ?

జవ్వనమునఁ దొలఁకు జగ్గునిగ్గులుపసి
వాడనట్టి కొమరుఁ బ్రాయమందె
ఈ వియోగజలధి నీఁదుచు లలితాంగి
పచ్చి పసుపుఁ గొమ్ము పగిదినొప్పె.

కమ్మనూనెలు, దుస్తులు, కాలిజోళ్ళు
నిల్వుటద్దాలు, లేఖలు, నీరజములు
కాంచినపుడెల్ల నీ రూపు కనుల వ్రేల
వేడినిట్టూర్పువుచ్చు నా చెలదిమిన్న .

నాఁడు విశ్వదహృద్గుహా నవ్య భవ్య
సరస భావమణీఘృణి శబలితంబు
నేఁడది వియోగ వాయుఘూర్ణిత నితాంత
ఘోరదుఃఖ రజఃపుంజ పూరితంబు

ఉడుగక నర్మగర్భ విషయోక్తి సుమాసవ మానువేళ నం
దడరి వనీవిహారమునకై రథమెక్కి గమించువేళ మీ
రడకపుఁ బ్రేమతో జలక మాడెడు వేళ మహోదయంబుగాఁ
దొడరిన యచ్చమోహరస తోయము లింకె విరాగకీలలన్

జన్మమునుబట్టి వేశ్య నాఁజనును గాని
దివ్యగుణముల సతులకుఁ దీసిపోదు
కాన గాంధర్వ వైవాహికమున శుద్ధి
యంచు మీ ప్రేమబంధమ్ము నెంచవచ్చు.

ఆటవెలఁది సుఖాంతైక నాటకమున
రంగమధ్యంబునని తెఱ వ్రాలిపోయె
ఇఁకఁ బ్రదర్శించు రూపక మెట్టిదనిన
నతి విషాదాంత నాటక మందుమయ్య.

రచ్చబండమీఁద విచ్చలవిడిఁ జేరి
తమ విచిత్ర జీవితములఁ గూర్చి
పౌరు లెంతో వింతపడి చెప్పుకొనుచుంద్రు
దైవఘటన మనుచుఁ దలఁచుచుంద్రు.

హృదయ దౌర్బల్య మిసుమంత యెఱుఁగనట్టి
నీ మహాత్యాగదీక్షకు నివ్వెఱపడి
యుష్మదాత్మీయ బంధువు లొక్కొక్కయెడ
మెచ్చుకొనుచుంద్రు నీ కీర్తి పిచ్చలింప.

మొగ్గ దొడుగునపుడు ముడుచుకొన్నను దఱి
వచ్చి పూవు సరిగ విచ్చునేనిఁ
బ్రొద్దుదిరుగు తురక ప్రొద్దునే చూడదా ?
విశ్వవినుతచర్య! వేమనార్య!

ఈషణత్రయంబు నీసడించిన నీవు
గణిక పలుకులెట్లు గణనసేతు ?
కడలి దాఁటునతఁడు కాల్వకు లోఁగునా ?
విశ్వవినుతచర్య, వేమనార్య !

కతిపయదినంబు లీరీతిఁ గడచినంత
నామెయు న్నీదు మార్గంబు ననుసరించుఁ
గామ తత్త్వంబు నిస్తుల ప్రేమతత్త్వ
మైక్యమై ముక్తినిధిఁ జూఱలాడకున్నె ?

ఎపుడు వెలయాలితో స్నేహ మొసఁగియున్న
నన్నగారన్న భక్తి నీకగ్గలంబు
కాన, నొకనాఁ డతండెదురైన యంతఁ
దలుపు చాటునఁ బిల్లివై దాఁగుచుందు.

మెఱపుఁదీగఁనుబోని నెమ్మోమునగల్గు
వారకాంత నొకింతలో వదలివైచి
అంతకంటె మహానంద మలవరించు
ముక్తికాంతను జేపట్ట మురిసితీవు.

ఆకాంతను నీ కాంతను
నేకమ్మొనరించి కులుక నేరికిఁ దరమా
లోకాతిశాయివిగదా !
నాకము నరకంబు గలిపినాడవు వేమా !

పశ్చాత్తాప విదగ్ధ పాపపటల ప్రాదుర్భవ చ్ఛిద్రిమా
నిశ్చింత ప్రతిభా విభాసుర మిళన్నిస్తంద్రి యోగక్రియన్
దుశ్చారిత్రి తమః ప్రభాకరుఁడవై దోఁతెంచు నిన్నెంతయున్
సాశ్చర్యోత్కృష్టతిఁ జూచు రాజ్ఞిఋణ మార్యా! తీర్తువా! జన్మలో

ఆ నరసాంబ మీ వదిన యద్భుత వత్సలతా ప్రపూర్ణయై
తానక కన్నసంతుబలెఁ గాంచెను ముద్దు మఱందివంచు నాఁ
డా నలినాక్షి నీవొక మహాత్ముఁడ వౌదని నమ్మెనేమొ! నీ
పూనిక కడ్డుసెప్ప దది పూర్ణముగా ఫలియించె వేమనా!

సారసనేత్రువంటి పతి సారసమిత్రునివంటి పుత్రులున్
సారసజాతవంటి సుత సారసవైరునివంటి కీర్తియున్
సారససన్నిభంబయిన సద్ధృదయంబును గల్గ నామె సం
సారము స్వర్గతుల్యమయి సజ్జన సన్నుతి గాంచుట బ్రిమే?

పెట్టెడువేళఁ దల్లివలెఁ బ్రేమను జూపెడివేళ భార్య నా
గుట్టును విప్పిచెప్ప తఱిఁ గూరిమి మంత్రివోలె నోర్పుతో
నెట్టన సేవసేయునెడ నేర్పుగఁ జేసెడి దాసియట్ల యా
పట్టపురాణి భర్తృ పద పద్మములన్ భజియించు నెప్పుడున్.

ఓసీ! సోదరుఁడిట్టు లయ్యెనని రాజోత్తంసుఁ డల్లాడఁగా
ఆసాధ్వీతిలకంబు తావకభవిష్యన్మాహాత్మ్య మూహించుచున్
మీసన్న్యాస మనన్యసాధ్యమని స్వామీ! భర్తతోఁ ద్వద్రసా
భాసానంద విలాసిభావములఁ దెల్పన్ లేఁడు శాంతింపఁడా!

అడిగిన దెద్ది కాదనఁడు తండ్రి విధాన
దయఁ జూచునని యెడి తరుణి యొక తె
మంతనంబున నైన మనసిచ్చి మాటాడు
మఱప్రరాఁడని పల్కు మగువ యొక తె
కలవారి బిడ్డనన్ గర్వ మించుక లేక
చనవిచ్చు ననుచుండుఁ జాన యొక తె
పెఱవారి కష్టముల్ విని సహింపఁగ లేఁడు
కడు జాలికలఁడనుఁ గలికి యొక తె

ఒక్క వేశ్యావిలోలత దక్కఁ బెక్కు
సుగుణముల కిక్కయని చాటు సుదతి యొక తె
ఇట్లు పరిచారికలు తమ యిచ్చ కోలఁదిఁ
బలుకుచుందురు కూరిమి మొలక లెత్త.

ఏ తల్లి గన్నదో నిను
నీ తీరుగ మోక్షరాజ్య మేలుటకొఱకై
ఆ తల్లి కాన్పె కాన్పని
చేతో ముదమొదవ నిజము సెప్పెదనార్యా!



## శ్రీ త్రి ప్రోఁ శ్రీ

ఆ పరాశర బాదరాయణ మరీచి
వాలఖిల్యాత్ష పాదాత్రి వామదేవ
నారద వసిష్ఠ సనకసనందనాది
ఋషులు వోయిన త్రోవ లీ దృశములన్న !

పాపభూయిష్ఠమైన ప్రపంచమందు
నిజము, కల్లగఁ గల్లయే నిజముగాను
కానఁబడుచుండు దాని నైఖరు లెఱింగి
తప్పుకొనుచుంద్రు నీవంటి తత్త్వవిదులు .

ఆరత్నాసనధమ్ము లా వనము లా హస్త్యశ్వశాలాదు లా
నీ శేఃాగరవాసిహంసతతు లా నిర్ణద్రభోగస్తుమ్ము లా
శ్రీః స్తన్యోపలవేదు లా చెలువ లా శ్రీగంధచర్చాదు లీ
వే రీతిన్ విడనాడి వచ్చితివి స్వామీ !విశ్వసన్యాసివై

తతహంసతూలికా తల్పంబులా లేవు
సొదలాఁటి దోఁచు బూడిదలుగాని
ద్యుతిమీఱివెల్గు విద్యుద్దీపములు లేవు
క్రాలు పెన్గాఱివి దయ్యాలుగాని

వందిమాగధ భట్ట వైతాళికులు లేరు
కాకఘూక సృగాలకములుగాని
చంద్రకాంతోపలాస్థానసీమలు గావు
పాలుసేయు రక్కసపొదలుగాని

వెఱచి పనిసేయువచ్చు సేవికలుగారు
ఎముక "లేద్బ్యక" తిను పిశాచములుగాని
సమ్మతింప విభూతి తత్త్వమ్ముగాదు
మృత్యుదేవత కోఱల మెఱపుగాని.

కొమ్మకుఁ గొమ్మ రాచుకొని ఘోరదవాగ్ని జనించి కాల్చు వృ
క్షమ్ముల, రోగరూపమున [illegible]హారముసల్పు మృత్యువే
ఋమ్మగ దుఃఖదూనమగు నీ జగమందె సుఖంబు గల్గనే
కుమ్మరి యావమందెవరు కోరిన నిత్తడి పాత్రలుండునే.

ఒకచోటఁ జిక్కని యుడుకునెత్తురు క్రాఁగ
భర్తృవియోగాగ్ని బగబగమను
ఒకక్రేవ నాశాలతోన్మూలహేతువై
పుత్రశోకాగ్ని క్రొంబొంగలుచిమ్ము
ఒక వంక వాత్సల్య వికల సాధనమయి
పితృ కాష్ఠవహ్ని విభీతి గొలుపు
ఒక దెస హృదయదారక ఘోరదృశ్యమై
మిత్ర దుఃఖజ్వాల మింటి కెగయు

ఒక్కచక్కి మధ్యమలోక ముద్ధరించు
కలము, కత్తి, కిన్నెర, కుంచె లలవిగాని
మంటలోఁబడి మలమల మాడుచుండఁ
గళలు కన్నీటితో జలాంజలు లొసంగు.

ఈ చితాభస్మవేదిక నీశుఁ డెక్కి
తాండవ మొనర్చు నుగ్రభూతములతోడ
ఈశ శబ్దార్హుఁడవుగాన నీవుగూడ
నిట విహారమ్ము సేయుదువే మహాత్మ !

ఔపనిషద వివేకానందగరిమచే
మన ఉద్ధతి మఱింత మాఱెనేమొ ?
వస్తుతత్వజ్ఞాన వైశిష్ట్యమునఁ జేసి
అద్వైతసిద్ధాంత మంటెనేమొ !
జనన మరణ దుఃఖ సంభావనం జేసి
అచలయోగరహస్య మబ్బెనేమొ ?
విమలబోధామృత వీచికారుచిరమై
కవితాస్రవంతి గ్రక్కదలెనేమొ ?

కుండలిని జిక్కఁబట్టి లోఁగొన్న కతన
అష్టసిద్ధులు స్వాధీన మయ్యెనేమొ ?
కడుపు చల్లఁగ నినువంటి ఘనునిగన్న
ఆంధ్రమాత కహర్నిశ మంజలింతు

మానసికతత్త్వ పరిణామ మార్గ మరసి
నిశ్చల సమాధినిష్ఠలో నిలిచియుండి
సచ్చిదానందమయుఁడు కాఁజాలినట్టి
యోగికంటె వినిర్మల భోగియెవఁడు ?

ప్రణవ పుంస్కోకిలధ్వని వినెడు చెవికి
ప్రణయ కాకారవమ్ము లేపాటి తనుపు
అమృతభాండమ్ము లభియించినంత నెవఁడు
కల్లుకుండిక నాశింపఁ గలఁడు చెపుమ ?

భక్త కబీరుఁ డిట్టులె స్వభావ విరుద్ధముగాని తీరులన్
శక్తి కొలంది సంఘ మది సంస్కరణం బొనరింప గేయముల్
రక్తి రచించి ముక్తికి సరాసరి బాటలు దిద్దె నీ క్రియల్
ప్రాక్తన పుణ్యకర్మ పరిపాకమునన్ లభియించుఁ బుణ్యుఁడా!

పండితులు వానిఁ బిలిపించి పరిహసింపఁ
దలఁచి వేదాంత చర్చకుఁ దలపడు మన
అవ్యయుని గన్నమాను విన్నట్టి మీకు
ఏటిచర్చల టని "టలాయించె" నంట.

రామ రహీము లిర్వురు పరాత్పరు లంచు సమన్వయించుచో
నామవిభేద భావములు నాశనమౌనని దీక్షఁబూని ని
ష్కామకళన్ రమారమణ గానసుధన్ జవిచూపె నాతఁడో
స్వామి ! జనానురాగయుత సత్యపథంబున నీకు నుద్దియై.

ప్రకృతి మధుకలశంబుగఁ బరిగణించి
తద్రసాస్వాదనానంద తత్త్వకలిత
మానసుండయి యద్వైత మార్గపరసె
ఉమరుఖయ్యా మతండొక యమరజీవి

మనము మంచిసేయ మనకు మంచియొనర్చుఁ
జెడు గొనర్పఁ దుదకు జెట్టసేయుఁ
గాన దైవమందుఁగల గొప్పతనమేది
అనుచుఁ బృచ్ఛసేయు నతఁడు మనల.

జంతుబలి తీవ్రముగ సాఁగు సమయమందు
అద్ది సరిదిద్ది సిద్ధార్థుఁ డవతరించె
హెచ్చు లొచ్చుల వైషమ్య మెచ్చినంత
నీవు జన్మించి నాఁడవు నిజముదెలుప

చెన్నా! అన్నులమిన్న కన్నుగవ మూసెన్ — జిన్ని బిడ్డండునున్
మున్నే నిద్దుర దోఁగియుండె — నదియేమో? దాటిపోవిలు — నీ
కన్నన్ నాయ మెవండొనర్చు నిపుడీ గాఢాంధకారమ్మునం
దన్నా! వాహముఁ దెన్నుపోవలయు — మోక్షానందముం బొందఁగన్

ఈ లోకంబున నింతకాలమిటు జీవింపన్ యథార్థంబెదో
జాలంబేదో యెఱుంగఁజాల మనసే సందిగ్ధ వారాన్నిధిన్
గూలం దేలెడి మార్గమేది! యిక సంకోచింపకే మాని పా
దాలన్ వ్రాలెద కానకేగి పరమాత్మన్నైన దర్శింపఁగన్

అంచు శుద్ధాంతమట వీడి యరిగి యరిగి
తత్త్వవార్థిఁ బడింబడి దఱిచి తఱిచి
అనుభవామృత బోధ నోలార్చినట్టి
బుద్ధభగవాను నీతోడఁ బోల్చుకొందు.

ఎవని జీవితయాత్రలో నెచట నేనిఁ
కంచు కాగడాల్వాని గాలించి యొక్క-
మచ్చఁ గనలేమొ ? అట్టి సన్మార్గుఁడైన
బుద్ధభగవానునకు సదా మ్రొక్కువాఁడ.

ఎట్టిధర్మము నతఁడు స్థాపింపకున్న
శౌరికిది తొమ్మిదవ యవతార మనుచు
వాకొనఁగఁ జెల్లు నానాఁటి వక్తలకును
దిగ్దిగంతర పూజలఁ దేర్చువారె ?

రవికిరణాలలో రంగు లెవ్వఁడు దిద్దు
పూలలో మధువింత పోయు నెవఁడు
అంభోధి సుతు నెవ్వఁ డమృతహస్తుని జేయు
గర్భస్థ శివులఁ గాఁచు నెవఁడు ?
అవని నాకర్షణ యంత్ర మెవ్వఁడు నిల్పు
నాకసమ్మునఁ జుక్కలదుకు నెవఁడు
ఎద గడియారంబు లెవ్వ డాడించును ?
నీటిలో విద్యుత్తు నిలుపు నెవఁడు ?

సృష్టిలోఁ బ్రేమరసముఁ జొప్పించు నెవఁడు
సృష్టి వైవిధ్యమును విప్పిచెప్పు నెవ్వఁ
డట్టి పరమాత్మ రూపు నీ వనవరతము
తనులఁ గట్టి వచింతువు కవివతంస !

కమ్మని కవితారస మొగిఁ
జిమ్మెడి నీ వాక్కు లెన్న జీవకళలతోఁ
గ్రొమ్మెఱుఁగు లీని హృద్దివ
మిమ్ముగ వెలుఁగొందఁ జేయుటెవ రెఱుఁగరయా!

నిన్ను కవీంద్రుఁగాఁ బరిగణింపరు ధూర్తులు దానికింతయున్
జిన్నతనంబు రాదు రససిద్ధుఁడ వీ వపురూప భావనా
భ్యున్నత నీ ప్రపంచమున కొరవులేదు మహాకవీ ! నినున్
మన్నన సేయు వారు పదిమంది జగంబున నున్నఁ జాలదే ?

కోరినయంత కాంచనము కొల్లలుగా లభియించునింట నే
కారణజన్ముఁడెవ్వఁడును గక్కినకూటికి నాససేయునా ?
నీ రసవాదముం దెలియ నేరక కేవలబాహ్యదృష్టితో
నీరసవాదముల్ సలుప నీకుఁ గళంకము రాదు వాక్పతీ !

ఎన్నఁటికైన లోకము గ్రహింపదె సత్యము, నాఁడు నీ గుణా
భ్యున్నతి దిగ్దిగంత విజయోత్సవజాత యశోవిశాలమై
మన్నన లందుకోఁ గల దమానుషశక్తియుతుండవైన నీ
యున్నది పావపూజ జగమొక్కటఁ గాదిఁక ముజ్జగంబులన్.

ఎఱుఁగక మాటలాడిన సహింతురు పెద్దలు శాంతచిత్తులై
యెఱిఁగి వచించినన్ విన సహింపరు చిన్నలు క్రోధదృష్టులై
యెఱిఁగి యెఱుంగనట్లు నటియింతురు కొందఱు హీనబుద్ధులై
వెఱవక సత్యవాక్కు వినిపింతురు మహాత్ములు ధర్మబద్ధులై.

గాలిని మూటగట్టి యొక కావ్యజగత్తు సృజించి యిచ్చు ధీ
శాలురు సత్కవీంద్రులు ప్రసాదము లేక కృశించుచుండ మా
ర్మ్యాలలఁ బ్రాఁతిపెట్టుదురు ముల్లెను లోభులదేమి లాభమో
కాలము గాలమా కవికిఁ గారణజన్ముల కర్మలేశమా ?

వేదాతీతుఁడు వేమనన్న పలుకే విశ్వంబునన్ వ్యాప్తమై
మోదంబున్ సమకూర్చుసూక్తి కుసుమామోదమ్ము నిక్షేపమై
వేదస్తుత్యమగున్ ద్వదీయ మహానావేశమ్ముతోఁ ద్వత్కథా
నాదబ్రహ్మసుఖానురాగమున నానందింతురు దివ్యాంగనల్.

భావనాశక్తి పరిణతి పడయకున్న
నెంత వ్రాసిన నతుకుల బొంతె యగును
ఆ రచన ముద్దు గొల్ప దం దతుకు లగుచు
బసని రేకుల నిర్గంధ కుసుమమట్లు

"సర్వంబ్రహ్మ్మ మిదం జగ" త్తనెడువాచారూఢి సత్యంబు మీ
గర్వాలాపము లేల ? మానుఁ డని వక్కాణించి తీ వందుచే
నిర్వాణామృత మాన నొల్లక నిరున్ నిందితు రేమందుమా
సర్వేశుండు భవత్కవిత్వమును విశ్వస్థాయి గావింపఁడే ?

"ఎవ్వ రేమనుకొన్న నాకేమి కొదవ?"
అన్న శ్రీనాథకవి నుడు లపహాసించి
అట్టి వానికె నామాలు పెట్టి రనఁగ
నితరులం గూర్చి పలుకుట కేమి వింత.

సదయా! శాశ్వత విశ్వభారతికి నీ సందేశ సూర్యప్రభల్
హృదయాంభోజము విచ్చెఁ దన్మధురసశ్రీలోలురౌ సాధులీఁ
దుదురీలౌకిక తత్త్వవారినిధి నిర్ధూతాఘరాగాంధులై
మది నైర్మల్యము నొంద సంతతము బ్రహ్మానందముంబొందఁగన్

దురహంకార పిశాచ తాండవధృతిన్ దూలించి మేలెంచి ఓ
కరుణా సాగర! విప్లవాత్మక కవీ! కైవల్యముం జూపుచున్
స్థిరబోధైక రసామృతమ్మొసఁగుచున్ దేశాటనం బీవొన
ర్చు రహిం గాంచఁగ నాది శంకరుల తీరున్ జ్ఞప్తికిందెచ్చెడిన్.

మతమొక మత్తుమందువలె మారణయంత్రమువోలె మాఱెనా
గతిచెడి దేశమెల్ల నరకంబునఁ గూలినభంగిఁ దోఁచు నా
మత మమృతంబునాఁదనర మానవలోకమె దేవలోకమై
కుతుకము గూర్చుఁ గాన మతగోష్ఠి విమర్శన సేయుదే కవీ!

ఎందఱో యుండరు నినువలె
సందేహాము దక్క నిజము చాటెడు వారల్
నిందన మానందన, మఱి
వందనములు స్వీకరించు వాడవు యోగీ!

తాటియాఁకు గంటమ్ము చేఁదాల్పలేదు
మనసులో నూహ లెసఁగిన మాత్రముననె
ఉపమ లలరారి సహజలోకోక్తు లెసఁగఁ
బలుకుచుందువు మృదువైన పద్య ఫణితి.

అరటి పండు నొలిచి యఱచేతఁ బెట్టిన
రీతి నెసఁగు నీదు నీతు లెల్ల
ననుభవింప లేసి యర్థమున కెవ్విధి
నచల సౌఖ్య మబ్బునయ్య వేమ!

శివకరమగు సత్యంబున
భవబంధవినాశహేతు భావయుతముగాఁ
గవనము సెప్పఁగలాఁడే
కవియనఁగాఁబరగు నన్యకవియుం గవియే?

రాజాధి రాజులు రాలిపోయిరి గాని
కవుల కీర్తికిఁ జావు గలిగె నయ్య!
దివ్యసౌధము లెల్ల దిబ్బలైనవి గాని
గ్రంథశక్తికి లోటు గదిరెనయ్య!
మతము లెన్నెన్నియో మాయమైనవి గాని
పాప పుణ్య విమర్శ వాసెనయ్య
వేషభాషాదులు భేదిల్లినవి గాని
జాతీయ భావముల్ సడలె నయ్య?

సకలలోక పదార్థ విజ్ఞాన శాస్త్ర
మెన్ని యో మార్పులఁ బొందుచున్న దైన
సృష్టి కాధారభూతుఁడై చెలఁగు సట్టి
పరమ శివులీల మనకంటఁ బడునటయ్య.

ఆకాశమున నైన నవకాశము ఘటించి
కనకంపు మేడలు గట్టువాఁడు
భూలోక మెల్లెడ గాలించి నిజ మెంచి
మించి వాగ్ఝరి మ్రోయించు వాఁడు
వసుధ వ్రయ్య లోనర్చి పాతాళమునఁ జొచ్చి
ఫణిపతి మణులు చేపట్టు వాఁడు
ఈరేడు జగముల కేకాంతముగ నూఁగ
వేడ్కమై నూయేల వేయు వాఁడు

బ్రహ్మ విష్ణు మహేశ్వర ప్రాభవములఁ
జలన చిత్రాలవలెఁ జూపఁజాలు వాఁడు
చెలఁగి సృష్టికిఁ బ్రతిసృష్టి సేయు వాఁడు
జ్ఞానికి సహోదరుఁడు మహాకవివరుండు.

జ్ఞాని యను వాఁడు మూఁడు లోకముల యందు
దుర్లభుం డని పెద్దలందరు కవీంద్ర!
పరమ హంసవు నీ సూక్తి పథ మెఱింగి
వసుధ లేఁడండ్రు వేమన వంటి యోగి.

బ్రహ్మమును బోలు గురుఁడును, భక్తుఁడైన
సిద్ధయను బోలు శిష్యుండు సిద్ధుఁడైన
వేమనను బోలు యోగి యే పృథ్వియందుఁ
బుట్టుచుందురో యదె పుణ్యభూమి సుండి.

ఓకవీ! నీదు పద్దియ మొక్కమాఱు
మనసు దీఱఁగఁ జక్కఁగా వినిన నరుఁడు
మరల జన్మములో దాని మఱచి పోక
సమయ మబ్బినఁ జదువును సామెతగను.

గుండు దెబ్బయైన గుఱి దప్పిపోవును
నాటు నీదునోటి మాట సరిగ
నోరుగలుగు తెలుఁగు వారెల్లరును నీదు
పద్దియములు నేర్వవచ్చు సరగ.

తిట్టినను హాస్య మొలుకం
దిట్టుటచే సుంతయైనఁ దీండ్రింపక యా
తిట్టించుకొన్న వాఁడే
గట్టిగ నవ్వఁడు నదేమి కారణ మబ్బా!

అన్ని రసములుండి హాస్యంబు లేకున్న
నదియు గొప్ప లోటె యనఁగ వచ్చు
ఉప్పు లేనికూర చప్పగా నుండదా?
విశ్వవినుతచర్య! వేమనార్య!

ఉన్నదున్నట్లు వ్రాయఁగా నొప్పుననుచుఁ
గంకణము గట్టుకొంటివి కవివతంస !
అబ్బ ! నీ దెబ్బ కుబ్బితబ్బిబ్బులైరి
వారు వీ రననేల — ఏవారలైన.

సంస్కృతచ్ఛాయలే మాకు శరణమనుచుఁ
గైతలల్లిరి తొల్లింటి కవులు — గాని
భావదాస్యము నీ పాలఁ బడని కతనఁ
దెలుఁగు వెన్నెల బయళులఁ దిరిగితీవు.

కారణ విమర్శనాశక్తిఁ గాంతుసేసి
హృదయమునఁ దావు దాని కర్పించి తీవు
కనుక నీకైత నెఱకులు గాడితీరుఁ
గత్తితోఁ గొట్టినట్టుల గానిపించు.

తాళిక, కళవళము, తారాడు బిత్తలి,
చాడి, సొడ్డు, దుడ్డు, సంబలమ్ము
బైసి, మంకు, రిమ్మ, బసివి యన్పదములు
కన్నడంపుఁ జెలిమి నున్న వన్న !

"వ్రాల కందని పద్యముల్ వేలసంఖ్య"
యనుచు నీచెప్పినట్టి వాక్యమును వినఁగ
నా రచించిన పద్యమ్ము లన్ని మాకు
సరిగ లభియించె నని చెప్పఁ జాలనయ్య.

కన్నడంబున నినుబోలు కవి యొకండు
కలఁడు సర్వజ్ఞుఁ డనఁగఁ — దమిళమునందు
వఱలెఁ బూర్వము "తిరువళ్ళు వరు" — తెలుఁగు
నందు నుపమింపఁ దగు వార లరుదు సుమ్ము.

విశదముగ నర్థము వచింప వీలుకాని
"కూటములు" గొన్ని తావుల గోచరించె
నందు సాంకేతికములకు నందనట్టి
భావములు గూడఁ గొన్నిటఁ బరగెనయ్య!

కక్షలఁ గొందఱు తమతమ
పక్షంబుగ వ్రాసికొనిన పద్యములిందున్
బ్రక్షిప్తములుగ నమరుట
ఆక్షేపింపంగఁ జాలరయ్యా! నిన్నున్.

రసపిపాస కతన రాణించు హృదయంబు
స్వల్పదోష 'మాత్రె' సరకుగొనదు
ముండ్లతీగలందు మొగలిపూవుండిన
విడువవలయు ననెడి వెఱ్ఱిగలఁడె?

నీదు కవితాస్రవంతిలో నిఖిలభావ
జీవరత్నాల వెలుఁగులు చిందులాడ
వెలుఁగు గనలేని చీఁకటి పులుఁగులెల్లఁ
దొలఁగి పోయిన నీకేమి దోసఁగు పోసఁగు.

అలఁతి యలఁతి పల్కులందొతో భావమ్ము
దిద్ది తీర్చు తెల్వితేటలందుఁ
దిక్కయుజ్వలీవు దీకైన కవివరా !
విశ్వవినుతచర్య! వేమనార్య!

కొందఱు కొండవీడనుచుఁ గొందఱు శ్రీనగమంచు గొంత సంబంధము నెంచుచుం గడపమండలమౌనని కొందఱాడఁగా సందియ మెక్కుడయ్యెఁ "దమ"జన్మ వసుంధర నిర్ణయింప నా డెందము సమ్మతింపదు గడించిన గాథలఁ దృప్తిదీఱమిన్.

మఱచితేఁ గొండవీడనిన మాత్రన జ్ఞప్తికివచ్చు నిప్పుకల్ చెరగిన రెడ్డిరాజుల ప్రసిద్ధపరాక్రమ వైభవంబు వా రఱమరదక్క చేసిన మహాకవిపూజలు, వారికై తలన్ వఱలిన యాంధ్రవాఙ్మయ సువాసన లుప్పతిలెన్ గనుప్పలన్.

వీరభద్రారెడ్డి కోరి కాశీఖండ
మంకితమంది ప్రఖ్యాతివడసె
కోమటిపోలయ వేమన, కాస్థాన
కవియాట నెల్లన గణుతికెక్క
ఆంధ్రవాఙ్మైపుణ్య మరసి మల్లారెడ్డి
షట్చక్రవర్తుల చరితవ్రాసె
కోమటి వేమన్న వామన శ్రీనాథ
కవులకుఁ గొల్విచ్చి గౌరవించె

"అమరుకము" నకు వ్యాఖ్యాన మతఁడె వ్రాసెఁ
గొమరగిరి వేమనరచించె నమృతమొలుకఁ
బనివడి 'వసంతరాజీయ' మనెడి నాట్య
శాస్త్ర మది తెల్గుతల్లి కాస్థానభూమి.

ఎత్తెఱఁ గెవ్వఁడే కపటకృత్య మొనర్చెనొ కొండవీటిలో
నిత్తఱి రెడ్డిపీఠులు నశించిన దుర్గముచూడ నక్కటా!
కుత్తుకనిండ రక్తమొగిఁ గ్రోలి యజీర్ణముచేతఁ జచ్చి యా
కత్తులబావిదయ్యమదె కన్పడుచున్నది రాక్షసాకృతిన్.

మొదట నభిరామయాభిధు మూలముననె
ఇమ్మహా బ్రహ్మవిద్య లభించెనంద్రు
ఆకృతజ్ఞత చూపుట కతనిపేరు
పద్యమకుటంబుగాఁ జేర్పఁబడె నఁటయ్య?

రాణి ముక్కునందు రాజిల్లు ముక్కెఱ
జంకకేల నీదు సాని గోరెఁ
గోరెఁ బో యదేటి కోరిక యనకుండ
నామె చెంత కెట్టు లరిగి తయ్య!

అడిగినవేళ యెట్టిదొ మహాసతి యాయమ దాని నెంతగా
నెడదఁ దలంచెనో "యటులె యిత్తును నావచియించురీతిగా
నుడుగక సల్పు" మంచుఁ జెవినూఁదిన గొప్పరహస్యమే మొయా
తొడవును వేశ్యకిచ్చె తఱిఁ దోఁచిన నాత్మవిరాగ మెట్టిదో.

మలమూత్రాస్థివసాస్రమాంసమద చర్మమ్మయు నిర్మాణమీ
ఈనా దేహము మోహసంజనకమా లాలిత్యమా నిత్యమా?
కలి మాయంబడి కొట్టుకొంటి ననుచున్ జ్ఞానార్థినై వేశ్యతో
"కలికీ! నీకును నాకుఁదీజె ఋణమింకన్ వీడు" మంచాడు మన్

దీనత్వమ్మొక రూపువొందినటు లందే నిల్చి సాలోచనా
ధ్యానమ్మొక్క క్షణమ్ము సల్ప నపుడంతర్వాణి యేమన్నదో
కానీ, కన్నుల నీకు నింపుకొని యాగాముల్ వితర్కింపకే
రాణిన్ మానసదృష్టిఁ గాంచి పరమార్థశ్రీ విలాసార్థినై.

వడివడి నేఁగి యా వదినె పాపములం బడి మోక్షదాయినీ!
వినుమను నీపదమ్ము లిఁక వేఁడెద నేఁ దరియించు మార్గమున్
నొడువు ఫలించునోములవి నోఁచినవన్నియు నన్ననల్లనం
దడవుచు ముంగురుల్ సతి సుధామధురంబుగఁ బల్కె నీకిఁకన్

ఏదీ నేఁ దరియించు మార్గమని నీవిట్లిప్డు ప్రశ్నింపఁగా
మోదంబయ్యెను నాకుఁ జెప్పునది యామోదంబుగా [illegible]చో
ఖేదంబుండదు నీకు – రాగలఁడు యోగిశ్రేష్ఠుఁ డాచార్యుఁడా
సాధూత్తంసముఁ గొల్చి దివ్యపథమున్ సాధింపుమో వేమనా!

ఏ నిమిత్తమాత్ర ననుచు భావింతువేసఁ
గాల మన్నింటి సరిదిద్దఁ జాలునయ్య
అంచు నిన్నుద్ధరించి సేవించినట్టి
భరతనారీవతంసమా వరసమాంబ.

ఔర! దుర్గంధభూయిష్ఠమైన చర్మ
భస్త్రికొఱకెంత వ్యామోహపడితి ననుచుఁ
గంపలోఁ బడ్డ కాకినై క్రాలువేళ
దారి దొరకెను శివయోగి దాపుఁ జేర.

శివయోగికి శిష్యుఁడవై
భవసాగరమీఁది సిద్ధివడసిన నీ యీ
శివయోగామృత సంభృత
కవితాగానం బొసంగుఁ గైవల్యమ్మున్.

నివురుఁ గప్పిన నిప్పునా నెగడునట్టి
మానసిక శక్తులన్నింటి మసి దొలంగ
దివ్య విజ్ఞాన దీపిక తేజరిలుట
సకల ధర్మంబులకు సది చరమసిద్ధి.

గురురూపంబున వచ్చి యీశ్వరుఁడె నీకున్ బోధగావించెనా?
పరమార్థంబది గాకయున్న నెటులిబ్బంగిన్ మనోసిద్ధియున్
సురసామ్రాజ్యము నేలుచుంటివి కవీ! శోభాయమానంబుగా
వెఱఁగా నీమహిమంబు నెన్నఁ దరమే వేనోళ్ళ శేషాహికిన్

తీయని కోర్కులం దనివి తీరక యూరక వట్టి లొట్టలన్
వేయుచుఁ గాలముం గడపి వృద్ధుఁడవై సుకృతం బదేమియున్
జేయఁగఁ జాలనైతినని చింతిలినన్ ఫలమేమి? నీవలెం
జేయు మహామహుండు రససిద్ధుఁడు సిద్ధాపథానువర్తియై.

గురుతర రాజ్యభారమునఁ గ్రుంగి కృశించి నశించిపోవు భూ
నరులకు దక్కునే ప్రణవ భావమణీ రమణీయ సౌధ భా
సుర రమణీమణి ప్రణయ సూత్రము? నూటికిఁ గోటికెవ్వఁడో
పురుషవరేణ్యుఁడై పుడమిఁ బుట్టుఁ దరించి తరింపఁ జేయఁగా.

రాజులు రాజ్యభోగముల రాజిలుచో యువరాజు లెంతయో
తేజము మీఱ సౌఖ్యములఁ దేలుచు బాహ్యవిమోహవాహినిన్
రాజిలుచుండ్రు గాని యిటు రమ్యపదార్థములందుఁ బ్రాంతిగా
మోజుఁదొలంగఁ ద్రోసికొని ముక్తి వరించెడి వారలుందురే!

ఎవ్వఁడు శాశ్వతం బిచట నెవ్వని కేది స్థిరంబు. దేనిలో
నెవ్వఁడు మేలుపొందు నెది యెవ్వఁడు చెప్పగలాఁడు తాపసీ!
దివ్వె వెలుంగుచుండఁగనె దేహగృహంబున నాత్మరూప మిం
కెవ్విధి నున్నదో తెలియుటే నరజన్మకు మోక్షసిద్ధిరా !

లోకుల కృత్యముల్ మనసులోఁ దలపోసి యథార్థమెట్టులే
వాకొనఁ జెల్లదాయని యవారితలీల నమాయికత్వమున్
జీకటి బాపి జ్ఞానకళ సృష్టియొనర్చిన ధాతవే నమో
వాకములయ్య నీకు జనవందిత! వేమనయోగిపుంగవా !!

కొండలు పిండిసేతుమను కోవిదు లెల్లరు నీదు ముందటన్
బెండులువోలెఁ గన్పడిరి బేలల మోసముచేయు మాటలన్
ఖండనసేయు వేళల నెగాదిగఁ జూచిరి సత్యధర్మ వా
క్పాండితి కుబ్బి భక్తి మెయి బాగుగ మ్రొక్కిరి నాఁడు నాఁటికిన్.

ఇచ్ఛకమాడఁగోరి స్తుతియించుట నామది కింతయేనియున్
నచ్చదు నచ్చెనా గుణగణంబుల మెచ్చక మానమాన్యులన్
ముచ్చటగా నుతించి కడుమోదము పొందని వాక్కు వాక్కె నీ
యచ్చపు బ్రహ్మ తత్త్వమున కంజలి పట్టెదనయ్య వేమనా!

విద్యాహీన నికృష్టలోకమిపుడీ వేదాంత విజ్ఞాన నై
వేద్యంబుం జవి చూడలేక వెలియై విశ్వాసమున్ వీడి సం
పాద్యమ్మొక్క ధనమ్మయంచుఁ దలఁపం బ్రాపించునే యాస్తికుల్
సద్యస్కాల సుఖాభిలాషులకు పజ్ఞాభాగ్యమెట్లబ్బురా ?

గూఢమైన విద్య గురుముఖమ్మున నేర్చి
స్వానుభవము కొఱకు శ్రమ మొనర్చి
నిన్ను నీవ తెలిసికొన్న ధన్యుఁడవన్న
విశ్వవినుతచర్య ! వేమనార్య !

కోర్కితీవలన్ని కూకటివ్రేళ్లతోఁ
బెళ్లగింపఁబడిన యుల్లమగుట
నలలుపుట్టనట్టి జలనిధివలె నుండు
నీ మనంబు నిభృత నిశ్చలముగ.

భోజరాజేంద్రు ముఖతేజమును గనుగొన
సంస్కృత కవిత్వమును జెప్పఁజాలిరంట
అట్టులే మిమ్ము దర్శించినంత నాకుఁ
దెనుఁగు లోకోక్తులం బల్క మనసు గలిగె.

# సూక్తులు

అవధూతా! భవదీయదర్శన విశేషాహ్లాద ముగ్ధుండనై శ్రవణానందముగా రచింతుఁ దమపేరం గొన్నిపద్యంబు లీ భవమందింతకుమించి చేయఁగల సేవాధర్మమొండేది? నా కవనమ్మే కృతిరూపమై సుకవితా కళ్యాణముల్ గూర్చుతన్.

చీకు చింత లేని చిన్మయ సూత్రముల్
ప్రజలకెల్ల బోధ పఱుపఁ దలఁచి
వేమనఁగ యోగి వెలసె నాంధ్రావనిఁ
బూజలిడుఁడు పుణ్యపురుషులార!

ఆటవెలఁదియయ్యె నర్థమెంతేఁగల్గి
నీ మహత్త్వవలన నిజము పలికి
మోహబుద్ధివీడి మోక్షంబుఁ జూపెరా
విశ్వవినుతచర్య! వేమనార్య!

అచలవిద్య తప్ప నన్యవిద్య లవెల్ల
పొట్టకూటికొఱకుఁ బుట్టెననుచు
నొట్టుపెట్టినట్టు లుగ్గడించితివయా
విశ్వవినుతచర్య! వేమనార్య!

ఆత్మతేజమెఱిఁగి యచలుఁడవౌ నిన్ను
లోకజాలమెట్లు లొంగదీయు
సూర్యుఁడున్నచోటఁ జొచ్చునా చీఁకటి ?
విశ్వవినుతచర్య ! వేమనార్య !

ఎఱుక లోకమెఱుఁగు నెఱుఁగదు తన్నుఁదా
జీవి తెలియలేఁడు జీవకళను
దనముఖంబు తనకుఁ గనఁబడు చుండునా ?
విశ్వవినుతచర్య ! వేమనార్య !

దిగినకాదె లోఁతు తెలియును నీటిలోఁ
దినినయంతగాదె తెలియు రుచులు
ననుభవించు నతఁడె యచలతత్త్వ మెఱుంగు
విశ్వవినుతచర్య ! వేమనార్య !

అబ్ధివంటిది పరమాత్మయందుఁ బుట్టు
నలలవంటివి జీవాత్మ లరసిచూడు
కానవంతట నిండినవాని నీశు
లేఁ డనుటకంటె మౌఢ్యము లేదు జగతి.

సృష్టింపబడిన జీవుఁడు
సృష్టను జేసుకొను యోగసాధనపరుఁడై
దృష్టిని భ్రూమధ్యంబున
స్పష్టముగా నిలుపవలయు శమదమరతుఁడై.

తనను దేహంబులోపలఁ దఱచిచూడ
నాత్మరూపుఁడుగా దేవుఁడమరియుండ
బయట నెందెందో కలఁడని పలుగులిడుట
వెన్నయుండఁగ నేతికి వెదకినట్లు.

ఐహికానందమే పరమావధియని
యాత్మజిజ్ఞాసచే బ్రహ్మమందలేక
కనఁబడని దేవుఁడెచ్చటఁ గలఁడటంచుఁ
బలుకు దుర్మార్గులెందఱో ప్రబలినారు.

దేవుదుండఁ డొక్క దేవాలయమునందె
దేవుడుండు సకల జీవులందు
దేవుఁడున్న తనువు దేవాలయముకాదె ?
విశ్వవినుతచర్య ! వేమనార్య !

మతముపేర త్రోఁడిమనుజులఁ గ్రిందికిఁ
ద్రొక్కఁదలఁచుచుండు ద్రోహులెల్ల
దివ్యపథముఁజూపు దేవతలౌదురా ?
విశ్వవినుతచర్య ! వేమనార్య !

మతము బోధించురీతి జీవితము నడుపు
మానవుండొక్కఁడైనను గానరాఁడు
మతవిరోధ పిశాచముల్ మాఱుమసల
ఘోరకృత్యాలు కొంపలఁ గూల్చుచుండు.

ఫాలభాగమందు బాగుగా వెలుగొందు
ఈశు శ్రీశు స్వప్రకాశుఁజూచి
సృష్టిమర్మమెఱుఁగు దృష్టియే వేదాంతి
విశ్వవినుతచర్య ! వేమనార్య !

ఆసనముల వలన నారోగ్యమును బొంది
యోగమెఱిఁగి దివ్యభోగ మెఱిఁగి
హాయిచెందువాఁడె యఖిలతత్త్వజ్ఞుండు ॥విశ్వ॥

అనుభవమున జ్ఞాన మార్జించి సంసారి
ఓర్పునేర్పులెన్నొ ఉగ్గడించు
రాజయోగిమాట రతనాలమూటరా ॥విశ్వ॥

ఇతరదేశములకు నీ దేశమునకును
మతము వేఱు దాని మహిమ వేఱు
కర్మభూమియందు మర్మముల్ పెక్కురా ॥విశ్వ॥

పొగడుచున్నవానిఁ బోషింపఁజూతురు
తప్పులెన్నువారి దరికి రారు
ఉన్నమాటయన్న నులుకెక్కువౌగదా ॥విశ్వ॥

ఆశయెంతయున్న నంతకష్టముగల్గు
తృప్తియున్న సుకము ప్రాప్తమగును
ఉప్పుఁదినిన కొలఁది దప్పిక పెరుగదా ? ॥విశ్వ॥

పిసినిగొట్టుచెంత పసిఁడి బొచ్చెంతున్న
ననుభవింప నేరి కనువుపడును
ఉదధిజలము త్రావ నుపయోగపడునయా ? ॥విశ్వ॥

స్వార్థరహితమైన సత్యప్రబోధక
గ్రంథమొకటిచాలు కవిరచనకు
పెక్కురాలకంటె నొక్క రత్నము మేలు ॥విశ్వ॥

ఒక్కవిద్య నొకఁడు దుత్తీర్ణుఁడయ్యె వే
రొక్కవిద్య నతఁడు మొక్కపోవు
జలముమీఁద బండ్లు సాగి పో నేర్చునా? ॥విశ్వ॥

రచ్చకెక్కువాఁడు రాజుకాఁ దగియుండె
నింటనుండువాఁడు హీనుఁడయ్యెఁ
గానికాలమందుఁ గర్మముల్ మాఱునా ? ॥విశ్వ॥

సంధ్యవార్చెదమని చదువుచు మంత్రముల్
మనసు వాంఛలందు మసలఁ జేసి
ముక్కుపట్టుకొనిన మోక్షంబు కలుగునా ? ॥విశ్వ॥

నిలువుబొట్టుఁబెట్టెఁ జెలువుగా శ్రీహరి
యడ్డబొట్టుఁబెట్టె నబ్జజుండు
తండ్రికొడుకులకిటు తగవేల పుట్టెనో ॥విశ్వ॥

చదువులేని భార్య చదువుకొన్న మగండు
కాపురంబు నెట్లు గడుపఁ గలరు ?
ఏటికీడ్వదున్న యెద్దెండకీడ్వదా ? ||విశ్వ||

మగనిమాట కెదురు మాటాడునది యాలె
యాలుకాదు నల్ల తేలుగాని
నరునకంతకంటె నరకంబు లేదురా ||విశ్వ||

పుట్టమీఁదఁ దేలు కుట్టిన నాగన్న
మయమటంచుఁ బల్కు మనుజులెల్ల
మంచి చెడ్డలరసి మాటాడఁజూతురా ? ||విశ్వ||

కలఁత లెసఁగు నింటఁ గలిమి యెంతేనున్న
సుఖముమాట నిండుసున్న సుమ్ము
పోరులేని కూడు బొక్కెఁడు చాలదా ? ||విశ్వ||

తానె యధికుఁడంచుఁ దలపోసి పేనల
బుద్ధిమాలి త్రోసిపుచ్చరాదు
సింహామునకు మేలు చిట్టెల్క సేయదా ? ||విశ్వ||

ప్రకృతియందుఁ గల్గు ప్రతి జీవికి గుణంబు
జన్మమందె కొంత జననమగును
దుమ్మచెట్టుముల్లు తొలుతనే పుట్టదా ? ||విశ్వ||

ఇష్టులైనవారి దుష్టచరిత్రముల్
కప్పిపుచ్చఁ దలఁచు ఖలుఁడు, కాని
లోకమెల్లమాయ మూకుఁడు దొఱకునా ॥విశ్వ॥

లచ్చిగల నరుండు లక్షభోగములొందు
లేనివాఁడు పొందలేఁడు జగతి
ఈఁకలున్న పక్షి యెగురదా స్వేచ్ఛగ ॥విశ్వ॥

జగతి నెప్పుడైన జ్ఞానబలంబుచేఁ
బశుబలము జయింపఁ బడును సుమ్మ
కత్తిపోటుకంటెఁ గలము పోటెక్కుడు ॥విశ్వ॥

సంఘముద్ధరింప సజ్జనుల్ కృషిసల్పఁ
దులువతొలఁగఁ బనులు నిలువఁబోవు
సన్నికల్లు దాఁచ జరుగదా పెండిలి? ॥విశ్వ॥

తనువు నిచ్చెఁ దనదు చనుబాలఁ బోషించె
గుణము తెఱుఁగజేసె గురుని జూపెఁ
తల్లి కంటె పూజ్యదైవ మింకెయ్యది ॥విశ్వ॥

అధిపు నండఁజేరి యల్పుఁడైనను జాల
గొప్పవాని తెఱఁగు గోచరించుఁ
దామరాకు నీరు తళతళ మెఱయదా? ॥విశ్వ॥

ఎన్ని మహిమలున్న నెట్లు పోషించినఁ
దనువు తిరముగాదు ధరణిపైని
నీటి మీఁది బుడగ నిలుచునా చిమగక ? ॥విశ్వ॥

పేదవారిగోడు ప్రేమతో నాలించి
యిచ్చునట్టి దాన మెట్టిదేని
వాడియున్న చేని పైఁబడు వానరా ॥విశ్వ॥

అల్పఋణము చేసి యధికుఁడు స్వర్గాందు
హీనుఁ డెంత యప్పునైన సేయు
నిండ మునిఁగినంత నుండునా చలిబాధ ॥విశ్వ॥

కఠినుఁడైన నెదుటఁ గల మాట పల్కఁడు
వాఁడు హాని సేయఁబోఁడు ప్రజకు
నఱచునట్టి కుక్క కఱచునా యెప్పుడైన ॥విశ్వ॥

స్వార్థపరుఁడు తనదు సౌఖ్య మన్వేషించుఁ
బరుల కష్టమునకు బాధబడఁడు
ఎద్దుపుండుఁ గనిన నీఁగకు జాలియా ? ॥విశ్వ॥

మగనిఁ దోసి అంకుమగని గూడిన దాని
పొత్తుఁ గోరదగునె ? చిత్తముచెడ
కుక్కముట్టుకొనిన కూటికాశింతురా ॥విశ్వ॥

క్షేత్రమెఱిఁగి విత్తు పాత్రమెఱిఁగి దాన
మనిరి పెద్దవార లది నిజంబు
జలధి వానకురియ ఫలమేమి కలదురా ? ॥విశ్వ॥

అల్పుఁ డాముఁ బోరసి యధికుల డీకొన్న
తాను హానిపొందుటే నిజంబు
తగరు కొండకెదురు తాఁకిన చందమా ॥విశ్వ॥

కాలమెట్టిమార్పుఁ గలిగించు చుండిన
నడ్డుపెట్ట నెవ్వఁడర్హుఁ డగును
ఏటివఱదనావ నేరికిఁ దరమయా ? ॥విశ్వ॥

మద్యసేవకంటె మాయజూదముకంటె
దురదకంటె నోటి దురుసుకంటెఁ
జిగురుటమ్ము గూర్చు చిక్కులు పెక్కురా ॥విశ్వ॥

ద్రోహి నెంత ప్రేమతో నాదరించిన
వాని సహజగుణము వదలఁడెందుఁ
బాలుపోయఁ బాము పాయునా విసమును ? ॥విశ్వ॥

సుదతిఁ బెండ్లియాడి ముసలి కులికిన
ననుభవింప నెట్టు లర్హుఁడగును ?
దంతపటిమ తొలఁగఁ దములము సేయునా ! ॥విశ్వ॥

లోకమాన్యులైన లోకుల గుణములు
బాల్యముననె కొన్ని బయటఁ బడును
బూవు పుట్టఁగానె తావులు చిమ్మదా ? ॥విశ్వ॥

మందుఁడని యెఱిఁగి చక్కని చుక్కయౌ
కన్యనేల యంటఁగట్టవలయు ?
బోసినోటికుక్క బొమికలు గొఱుకునా ? ॥విశ్వ॥

స్వల్ప భేదములను సవరించుకొనలేక
వనిత మెట్టినిల్లు వదలుటన్న
పట్టఁగొమ్మ విడిచి పెట్టిన విధమురా ॥విశ్వ॥

పల్లెఁబుట్టి మల్లె యిల్లాలి తలనెక్కె
నడవిమల్లె రాలి పుడమిఁ బడియె
జనులకూర్మి దక్కె ఘనుఁడును ఘనుఁడౌనె ? ॥విశ్వ॥

అన్నియున్నవేళ నందఱుం జుట్టలే
లేనివేళ నొండుఁ గానఁరాఁడు
ఇంట బెల్లమున్న నీఁగలు ముసరవా ? ॥విశ్వ॥

బాలురాఁడదగిన భావముల్ గమనించి
యాడవలయు మించి యాడరాదు
పిన్ననోటికేల పెద్దపెద్ద పల్కులు ॥విశ్వ॥

దుష్టబుద్ధియైనఁ గష్టముల్ గలవేళ
దీనరక్షకుండు దేవుఁడనుచు
పెన్నదాటువఱకుఁ బెరుమాళ్ళ సేవరా ॥విశ్వ॥

కలిమి లేమియైన చెలుములు పగలైన
మంచివాని గుణము మాఱదెప్పుడు
గట్టిరంగు గుడ్డ కగ్గునా యుదికిన ? ।విశ్వ॥

ఇంత పదవియున్న నెగిరిపడెడువాఁడు
పెత్తనంబు తొలఁగ తొత్తెయగును
గోఱలూడఁ బెఱుక తీరదా యహిభీతి ॥విశ్వ॥

అలరు వేళకంటె నాపదలందింక
నుత్తముల గుణము మహోజ్జ్వలమగు
కరగినంతఁ బసిడి కసలెల్ల వాయదా ! ॥విశ్వ॥

మందమందు సరకు మాణిక్యముగనున్న
నప్పునిత్తుమన్న నడుగరెవరు
కడుపు నిండినంత గారెలు చేదురా ! ॥విశ్వ॥

పనికిరానివారలని తోఁచినను బంధు
వులను వీడి వృద్ధిపొందలేవు
పొట్టుతీసివేయ మొలకెత్తునా గింజ ? ॥విశ్వ॥

మేలుకోరువాఁడు మిత్రుఁడు — భర్తతోఁ
గష్టసుఖము లోర్వఁగలది గృహిణి:
కూడుపెట్టువాఁడు కూరిమి కొడుకురా ||విశ్వ||

ఎండవాన లనక పండించి ధాన్యముల్
తిండి కలుగఁజేసె దేశమునకు
రైతుకంటె లోకరక్షకుఁ డెవఁడయా? ||విశ్వ||

గర్భశత్రువైనఁ గాలాను గుణియౌచు
నుపకరించు మనకు నొక్కొకయెడఁ
గాకి గూఁటిలోన కోకిల పెరుఁగదా? ||విశ్వ||

సమయమెఱిఁగి రాజసము వీడుటే మేలు
బెట్టుగాలివాన కొట్టినపుడు
తుంగ వంగి బ్రదుకఁ, ద్రుంగదా పెన్వృక్షము ||విశ్వ||

శీలవంతు నొక్క చెడ్డ మాటాడిన
కలఁత నొందు హృదయ కమలమందు
నెత్తురున్న చోట నొత్తిన నొప్పిరా! ||విశ్వ||

పాపభీతి కలిగి వర్తించు మానవుల్
జమునకైన నేల జడియు వలయు
నిప్పు పట్టుకొనక నీచేయి పొక్కునా? ||విశ్వ||

అన్న వస్త్రములకు నధిపతు లిద్దఱు
కర్షకుండు వసన కారకుండు
వారి మేలు కోరవలదొకో సుజనులు ||విశ్వ||

సజ్జనుండు గొప్ప స్థానముఁ బొందుచోఁ
ఖలువ తూలనాడ ఫలమదేమి?
ఏన్గునెక్క కుక్క కెవ్వఁడు భయపడు? ||విశ్వ||

నిన్ను నీవ పొగడుకొన్న లాభంబేమి?
పరుల మెప్పు వడయ ఫలము గలదు
స్వకుచ మర్దనమున సంతోష మొదవునా? ||విశ్వ||

తిట్టు నట్టి నోరు తిరిగెడి కాలును
నూరకుండఁ గలవె? యొక్క క్షణము?
దాన మిచ్చు చేయి దాఁచిన దాగునా? ||విశ్వ||

మోహనాంగి తన్ను ముదముతోఁ దిలకింప
భ్రమ జనించు నెంత వానికైన
గాలి గొట్ట జ్యోతి కదలక నిలుచునా? ||విశ్వ||

స్త్రీల తోడి పొత్తు చిత్తంబు చెఱచును
ధాతకైన వాని తాతకైన
నినుపముక్క లాగదే యయస్కాంతము ||విశ్వ||

ఆస్తికంటెయుమ్మ యధిపతికే హాని
యీడ్పుకాళ్ల తల్లి యింటికిఁ జేటు
పోర్పులేనివార లూరికే చేటురా ॥విశ్వ॥

అతి రహస్యమైన యాత్మీయ విషయము
స్త్రీల చెవిని వేయఁ జిక్కు పొదవు
పువ్వుఁబోణి నోట నువ్వులు నానునా ? ॥విశ్వ॥

అందమైనవాఁడ ననుకొని సాధ్వుల
చెనకరాదని మిగుల చేటుగలుగు
ఇంద్రునంతవాఁడె యిగిలింపఁడా పండ్లు ? ॥విశ్వ॥

జవ్వనంబు మనకు శాశ్వత మనుకొని
వృథయొనర్చుకొన్న వ్యథజనించు
గిట్టుపొట్టు వరద కలకాలముండునా ? ॥విశ్వ॥

యౌవనమున ధనము నార్జించి చివరకు
నిలువసేసికొనక కలదె సుఖము
దాహమైన యపుడ త్రవ్వెదవా బావి ? ॥విశ్వ॥

ఇల్లె తనకు గొప్ప యిలువేల్పుగా నెంచు
దేబె విశ్వమెట్లు తెలియఁ గలఁడు
బావిలోని కప్ప పరికించునె జగంబు ॥విశ్వ॥

మంచికొఱకు మనసు మనసారఁ బనిసేయఁ
జెట్టవుట్టు గొన్ని పట్టులందు
సమృతమునకుఁ దఱవ హాలాహలము గల్గె ॥విశ్వ॥

కపటి కానివాఁడు కసరి పెల్లాడిన
నుల్ల మంతలోనఁ జల్లఁబడును
నిప్పుకంటివేల్పు నీటిని దాల్చెరా ।విశ్వ॥

సహజ కవికి గొప్ప సాహిత్య మబ్బిన
అతని కళను జెప్ప నలవి యగునె?
జాతిరత్నమునకు సానబట్టిన భంగి ॥విశ్వ॥

పుట్టుగ్రుడ్డి లోక మెట్టు చూడఁగలాఁడు
పంగువెట్లు కొండ ప్రాఁకఁగలఁడు
మూర్ఖమానవులకు ముక్తి లభించునా? ।విశ్వ॥

ప్రాణమున్నవఱకె ప్రాణి సౌందర్యమ్ము
ప్రాణమూడఁగట్టె పాడువడును
పంజరంపుఁ జిలుక పారిపో నేమగుఁ ॥విశ్వ॥

చచ్చునాఁ డొకండు చావక భారత
సంగరంబుఁ గూర్చి చచ్చె శకుని
రాచపీన్గు తోడు రానిది బోవునా ॥విశ్వ॥

తప్పులేనివాని దండింపఁ జూచిన
దైవమహిమ నదియ తప్పిపోవు
ఎప్పుడైనఁ జెదలు నిప్పున కంటునా ? ॥విశ్వ॥

ఎట్టికూ్రరుడైన నెఱిఁగి విమర్శింప
దండిగుణము లేవొ యుండవచ్చు
నత్తలున్నవార్ధి ముత్తెములుండవా ? ॥విశ్వ॥

ఆత్మరక్షణమున కనువైన కఠినత
లేకయున్నఁ జెనకు లేకియైనఁ
గట్టిలేనివాని గొట్టియుం గఱవదా ॥విశ్వ॥

ధూర్తవినయమునకుఁ దూఁగాడి మేల్సేయ
నెంతొకీడు దలఁచు హితున కతఁడె
సొమ్ముదిన్నవాఁడు బొమ్మగుద్దిన యట్లు ॥విశ్వ॥

తల్లిదండ్రు లింత తప్పుసేసిన తోన
సడ్డగింపవచ్చు నాత్మజుండె
అగ్గి, దేవుఁడైన నడరిన నార్పమా ? ॥విశ్వ॥

పలువ పరిహసింపఁ దలపడియుండ నీ
వూరకున్న దైవమూరకొనదు
కావలసిన పనిని గంధర్వతతిసేసె ॥విశ్వ॥

శైశవంబునుండి సరిగ శిక్షింపక
పెనుకఁ జూతమనుట పెఱ్ఱితనము
గోటఁబోవుపనికి గొడ్డలివలయునా? ॥విశ్వ॥

ఒకరి మేలుచూడ నొల్లక యితరుల
చెఱుపఁదలఁతు వేని చెడెదవీవు
జింకఁజంపఁ గుట్రజేసి నక్కయెచచ్చె ॥విశ్వ॥

ఘోషయాత్ర కేగెఁ గురురాజు లీవిగాఁ
బరిభవింప నెంచి పాండవులను
దానొకండు దలఁప దైవ మొండు దలంచె ॥విశ్వ॥

తనదుశక్తి మించి పనిసేయఁ దలపడ
నృపునకైనఁ గల్గు నపజయంబు
ఉక్కుకత్తియైన ముక్కలు పోవదా? ॥విశ్వ॥

ఐకమత్య మనెడి యాయుధమున కిహ
లోకశక్తులెన్నొ లొంగిపోవు
పోరునష్ట మెపుడు పొందులాభముకదా ॥విశ్వ॥

ధర్మమాడు వలఁతి నిర్మలజ్ఞానియే
పిన్నపెద్దతనము లెన్ననేల?
కర్ణుకంటె సభ వికర్ణుని మెచ్చదా? ॥విశ్వ॥

, అదనెఱింగి పలుకు నధికారిమాటకు
రెండువైపులందు నుండు పదను
నృపులతోడి పొత్తు నెత్తురుకూడురా ॥విశ్వ॥

తత్త్వమరసి మనము తగినటు మాటాడ
దుష్టుఁడైన మనకు నిష్టుడగును
నాగమైన, నాడు నాగస్వరం బూఁద ॥విశ్వ॥

కార్యసాధనంబ కాంక్షించువార ల
త్యల్పునైన పూజ్యు డనవలయును
గండ కోఱకు నక్క కాకిని బొగడదా ! ॥విశ్వ॥

ఎవనినైనఁ జంక నిరికించుకోను తఱి
సూత్రమెఱిఁగి చేయ సుఖము కలదు
ముక్కుత్రాడు లాగ మోమూపదా యెద్దు ? ॥విశ్వ॥

ఎఱుఁగనట్టు లెదుట నిచ్చక మాడుచు
సమయమబ్బ హాని సల్పునొకఁడు
కన్నుతగులు పుల్లఁ గనిపెట్టి తిరుగరా ॥విశ్వ॥

, అన్నియున్నవార లాకులోఁ బిందెలై
యణఁగి మణఁగి యుందు రబ్బురముగ
ఫలవిశిష్టశాఖ బహునమ్రతను జూపు ॥విశ్వ॥

వదిసీయఁగోరి యెవ్వఁడు వెడలినం
గలిమిగల గృహంబె కానఁబడును
కాయలున్న చెట్టు చాయను జూడరా ॥విశ్వ॥

ఉత్తముండు పొందు నుపకారమింతైన
గొప్ప ప్రతిఫలంబె కూర్చు మరల
గంపెడీయ నిలసు గరిసెడు మనకిచ్చు ॥విశ్వ॥

సరసుఁ డొక్కొకతఱి పరమార్థమున కేగఁ
బ్రతిఫలంబు కీడు ప్రాప్తమగును
స్మరుఁడు పూలువేయ హరుఁ డగ్నిఁ జిమ్మఁడా? ॥విశ్వ॥

పతిత జనుల కొఱకుఁ బ్రాణ మిచ్చిన యట్టి
ధీరపురుషవరుల దివ్యచరితఁ
బ్రోదిసేసి రోళ్ళ రోకళ్ళ బాడరా ? ॥విశ్వ॥

బ్రతికియున్న వేళ వ్యర్థుడుగానున్నఁ
జచ్చినపు డొకింత మెచ్చు జనము
ఉన్న లిక్క, యదియ యూరేగఁ గొడవలి ॥విశ్వ॥

ఆత్మ తత్త్వవేత్త యజ్ఞాని ననువుగ
నంకె కీడ్చి ఫలము నందఁ గలఁడు
గంత గట్ట నెద్దు గానుఁగఁ ద్రిప్పదా ? ॥విశ్వ॥

తూలనాడియైన మేలుచేయఁ దలంపఁ
దెలివి లేనివాఁడు నిలువలేఁడు
చెవరఁ గొట్ట పశువు బెదరి పోకుండునా ? ||విశ్వ||

వలయు దానికొఱకుఁ బనిసేయకుండి త
త్ఫముఁ బడయఁ గోరఁ గలుగఁ గలదె ?
విత్తకుండఁ గోయ వెడలిన చందమా ||విశ్వ||

పుట్టుపేదయైన భోజనసౌఖ్యంబు
పాడియున్నఁ గొంత పడయవచ్చు
నఱువదాఱుకూర లావుచంటఁ గలవు ||విశ్వ||

ఇష్టమైన పనియ యిత్తుమం చడిగినఁ
గష్టమైన పనికిఁ గడఁగఁ డెవఁడు
ఎద్దునడిగి గంత నెవ్వఁడు కట్టురా ? ||విశ్వ||

కలుషమతులకెందుఁ గాలంబు గాలమే
నీతిలేనిచోట నిలువఁదగదు
చేతగానిపనులు చేయుట రోతరా ||విశ్వ||

ఉర్వినేలఁదగిన యున్నతోద్యోగియే
లంచగొండి యగుట లక్షణంబె ?
కంచె చేనుమేయఁ గాపేమి చేయురా ? ||విశ్వ||

ధనమొసంగువాఁడె ధవుఁడని భావించు
గణిక కెవనియందుఁ గలుగు ప్రేమ
పలువురేగు బాటఁ బచ్చిక పుట్టునా ? ॥విశ్వ॥

ఎఱుకలేక యెవరొ యెద్దీన నన్నను
గాటగట్టు మనెడి ఘనులు గలరు
భావదాస్య మెంత పనికిమాలినదయా ॥విశ్వ॥

నీచుచెంత జేరి నీతులు దెల్పిన
నాదరింపకెంతొ యుపహసించు
మోటువాని కిడిన మొగలిపూ చందము ॥విశ్వ॥

చంకబిడ్డలేని చక్కఁదనంబేల
యనుభవింపలేని యాస్తియేల
బుధుల మెప్పెఱుఁగని పురుషజన్మ మదేల ? ॥విశ్వ॥

మెఱుపుతోడసాటి మిణుగురుపుర్వౌనె
పండితునకు దీటు పామరుండె
యాత్మశక్తితోడ నన్యశక్తి సమంబె ! ॥విశ్వ॥

మాతృభాషలోన మంచి పాండితిలేక
యితరభాష వే గ్రహింపఁ గలవె ?
నేలవిడిచి సాము నేలచేయఁగవలె ? ॥విశ్వ॥

ఊరుగాని యూర నోరూరఁ జేసిన
తెలుఁగు పలుకుతీరు తియ్యఁ దనము
తెనుఁగువారికేమొ తేలిక యయ్యెరా ! ॥విశ్వ॥

కావ్యశిల్పమునకుఁ గళఁగూర్చునది ధ్వని
దానిబాహ్యతనువు తగిలినశైలి
రెండు పక్వమైన నుండదా పెన్నిగి ॥విశ్వ॥

మామపెత్తనంబు మర్యాదచిహ్నము
మగనిపెత్తనంబు మగువసుకము
అత్తపెత్తనంబు కత్తులబోనురా ॥విశ్వ॥

ఆత్మలేనివారి కైశ్వర్యములనిచ్చి
మంచివారినోట మన్నుగొట్టు
మాయదారిబ్రహ్మ మతమేమి మతముగా ॥విశ్వ॥

మధ్యవచ్చు గుణము మాన్పవచ్చునుగాని
సహజగుణము మాన్ప జాలరెవరు
కుక్కతోఁక నెవఁడు చక్కజేయఁగనేర్చు ॥విశ్వ॥

ఒకరికొకరు సాయ మొనరించుకొనఁ దగు
నండలేని యూర నుండఁదగదు
తల్లిలేని బిడ్డ ధరణి కెక్కువకదా ? ॥విశ్వ॥

ఎన్నొ సుగుణములకు నిక్కయౌ సజ్జను
స్వల్పదోష మొండు సరకుగొనరు
టిక్కటేనిమచ్చ లెక్కకు వచ్చునా ? ॥విశ్వ॥

గొప్పవారిలోని గొప్పతనంబును
గొంటె యెట్లు తెలిసికొనఁ గలండు
కమలమిచ్చు మధువు, కప్ప గ్రహించునా ? ॥విశ్వ॥

తనదు విషయ మెఱిఁగి తనపయి యధికారి
కోరుకొన్న మేలు కూర్పఁబోఁడు
అడుగకున్న బువ్వ యమ్మయుం బెట్టునా ? ॥విశ్వ॥

సహజశక్తి లేని చవట శా గొనరింప
వలనుపడునె యెట్టి వానికైన ?
పటమునఁ గల దంతి పనికివచ్చునె యెక్క ! ॥విశ్వ॥

నెమలితోఁక విప్పు రమణీయముగ నుండు
కూఁతవేయ మిగుల రోఁత పుట్టు
ఒప్పులన్ని యొకట నొనగూడవా యేమి ? ॥విశ్వ॥

మాయ మనకు లొంగ మార్గమెయ్యది లేదు
యోగసాధనం బదొకటి తక్క
అద్రివంటి యేన్గు కంకుశమనభీతి ॥విశ్వ॥

పండితునకుఁ జేత భారతమున్నప్పు
వర్జ్యమడుగనేమి వాకొనునయ ?
నరపతి మొలకత్తి క్షురకర్మ కనువౌనె ||విశ్వ||

అధికబలుఁడుగూడ నల్పునిచేతిలోఁ
జిక్కుపడి కృశించు నొక్కకయెడఁ
జెవినిగుట్టునీఁగ సింగమేమియొనర్చు ||విశ్వ||

అనుభవజ్ఞుఁడైన యద్వైతగురుఁజేర
శిష్యుఁడెట్టిఁడైన సిద్ధిఁబొందుఁ
బరుసవేది యినుము బంగారుసేయుగా ||విశ్వ||

కొఱఁతలేనివాఁడు కోటికొక్కఁడు లేఁడు
కొన్నియున్న నేవో కొన్నిలోటు
లందమైన మోముగలదు నా తావితో ||విశ్వ||

ఆతతాయియైన నాత్మరక్షణఁ గోరి
చేతులెత్తి మ్రొక్కఁ జిదుమఁ దగదు
అభయహస్తమిచ్చి యాదరించుటె మేలు ||విశ్వ||

శక్తియున్నయపుడ సాధించి ధనమది
వెచ్చపెట్టుప్రజలు మెచ్చుపనికిఁ
బోవునపుడురాదు పుచ్చినవక్కైన ||విశ్వ||

ఆత్మదేశమందు నంతశకలహమున్న
నితరుఁడోర్చి నెత్తికెక్కఁగలఁడు
పిట్టపిట్టపోరు పిల్లిదీర్చినరీతి ॥విశ్వ॥

బ్రహ్మపురముఁ జేరి పరమసుఖంబంద
ననుభవంబులెన్నొ యాడుచుంద్రు
ఊరుఁజేరు దారు లుండవా పెక్కులు ॥విశ్వ॥

సాధువరులు మోక్షసామ్రాజ్యమును వీఁడి
వ్యర్థరతులఁ జిక్కుపడరు, హంస
గంగవదలి బురద కాల్వకుఁ బోవునా? ॥విశ్వ॥

వేరులేనిచెట్టు విశ్వంబువ్యాపింప
రూపులేనిపోతు ప్రాపునంది
గూడులేనిపెంటి గుడ్లెన్ని పెట్టెరా? ॥విశ్వ॥

తల్లిదండ్రు లెంత చల్లనివారైన
మిట్టిపడెడు సుతులు పుట్టవచ్చు
జలధరములనుండి వెలలవా? పిడుగులు ॥విశ్వ॥

విలువలేని వట్టి వలువల కడుపున
నుద్ధరించు కొడుకు లుద్భవింత్రు
మంటిలోన మంచి మణులెన్నొ పుట్టవా! ॥విశ్వ॥

ఘనుల గుణముఁజూచి గౌరవించుట లెస్స
పుట్టువెన్నికోలు పుచ్చరాదు
పంకమందుఁ బుట్టఁ బద్మము నీచమా ? ॥విశ్వ॥

రామునంతవాఁడు రాజ్యమున్ విడనాడి
యడవులందు గొప్ప యిడుమలందె
నెంతవారికైనఁ జింతలు తప్పునా ? ॥విశ్వ॥

అందమైనదాని నాశింతు రెల్లరు
కళనశింప దానిఁ గాంక్షఁగనరు
వాడియున్న పూలు వనితలు ధాల్తురా ? ॥విశ్వ॥

జగతి నందజువలె జన్మించియున్ యోగి
లీనుఁడగునె లోకలీలలందుఁ
బాలఁబుట్టి వెన్న పాలలోఁ గలియునా ? ॥విశ్వ॥

కడుపులోని కింత కసరు పోయినఁగాని
స్నాన మొసఁగునట్టి శక్తి వేఱు
మోవు తడియుదేని మొక్కకు జిగిరాదు ॥విశ్వ॥

బిడ్డపుట్టి తనదు దొడ్డ యాశలనెల్ల
వాఁడె తీర్చుననెడి వాఁడె వెఱ్ఱి ;
మొలక పుట్టినంత ఫల ముప్పతిల్లునా ! ॥విశ్వ॥

కృష్ణునంతవాఁడు కేవల భక్తుకు
చేలు నాదరించి సిరు లొసంగె
నొడికమైన యెఱుక పిడికెడు ధనమంద్రు ॥విశ్వ॥

సద్గుణంబు లవ్వి జన్మమ్ముతోఁ గాక
నడుమఁ బొడముననుట నవ్వులాట
హంగు విడిసిపోయి రంగు మాఱఁగవచ్చు ॥విశ్వ॥

దాసి నభిలషింపఁ దగదను సైరంధ్రిఁ
గూడఁదలఁచి కీచకుండు మడిసెఁ
బుట్టుబుట్టు బుద్ధి పుడకలతోఁ బోవు ॥విశ్వ॥

మంత్రతంత్రయంత్ర మర్మజ్ఞు లన్నిట
ముందు నిలిచి విజయ మందఁగలరు
ఏది లేనివారి కేదారి లేదురా? ॥విశ్వ॥

చెప్పువాఁ డొకండు చేయువాఁ డొక్కఁడు
లేకయున్నఁ గలదె! లోకనటన
అంద ఱరద మెక్క నదలించువా రేరు? ॥విశ్వ॥

తీర్థయాత్ర కతన దేహమ్ము శుద్ధమా
క్షేత్రదర్శనమున నేత్ర మలరు
సాధుసేవనమున సద్భావ మలవడు ॥విశ్వ॥

తనకు హాయిగొలుపు మనుజుని గుణ మొందు
తెలియు టరిది మొఱకు దెలివి లేమి
గంద మొలుకఁ బూయ గాడిద యలయునా ? ॥విశ్వ॥

ఆర్యజాతి దైవమైన శ్రీవిష్ణువు
బుద్ధుఁడనెడి పేరఁ బుడమిఁ బుట్టి
అన్యమతము నెందు కతఁడె స్థాపించెరా ? ॥విశ్వ॥

అఖిల ధర్మములకు నాటపట్టనఁ దగు
సత్యనిష్ఠ వొలియ శాస్త్రమేల ?
వ్యాధి విరహితునకు నౌషధ మేలరా ? ॥విశ్వ॥

కావ్యకర్త పడెడు కష్టమ్ము పెఱవారి
కెట్లు తెలియునేర్చు నిట్టిదియని
బిడ్డ నొప్పులెల్ల గొడ్డురా లెఱుఁగునె? ॥విశ్వ॥

ఇంటి గుట్టు మట్టు లితరుల కెఱిఁగింప
లగ్గు గలుగనేర దెగ్గెగాని
కడుపు చించుకొన్నఁ గాళ్ళముందఱఁబడు ॥విశ్వ॥

కొండమీఁద నున్న కోఁతైన దిగివచ్చు
ధనము చేతినిండఁ దనరెనేని
డబ్బులేనివాఁడు డుబ్బుకుఁ గొఱగాఁడు ॥విశ్వ॥

పాంచభౌతిక ప్రపంచకవస్తువు
దేనఁ గలిగె దాన లీనమవును
నీటఁ బుట్టు నుప్పు నీటనే గరఁగురా ॥విశ్వ॥

బాధ గుణువుచేరి బాధించు నటుగాక
బోధగుణువు జ్ఞాన బోధసేయు
గుణము కుదురకున్న గుణువేల కొల్పనా? ॥విశ్వ॥

అందగత్తెయైన యాంధ్రను విడనాడి
వేశ్య దగిలియుంట వెఱ్ఱితనము
పంటచేను దొలఁగి పరిగ కాసింతురా! ॥విశ్వ॥

ఆతఁడెవ్వఁడైన నవగుణ మెంచక
గొప్పగొనము లెన్నుకొనుట లెస్స
పశువొసంగెనంచుఁ బాలానకుందురా? ॥విశ్వ॥

శుభ మశుభము దెల్పఁ జూఱునఁ గొవను
కాకి కెవఁడు సెప్పె లోకవార్త
ఈశ్వరాజ్ఞ దక్క యితరాజ్ఞ లున్నవా? ॥విశ్వ॥

కూడుగుడ్డలంచుఁ గుందెడు నిఱుపేద
నుద్ధరించు మార్గ ముత్తమంబు
దీనజనుల సేవ దేవుని సేవరా! ॥విశ్వ॥

తనదు భోగ మోలిఁ దఱిఁగిపోయె నఁటంచు
దీనవదన మయ్యేఁ దెలుఁగుఁ దల్లి
ఆమెగోడు నరయు నంధ్రులు లేరయా ॥విశ్వ॥

రాజశాసనాను రాగమ్ము సడలిన
నిష్టమైన కరణి నెసఁగు జనము
కట్టతెగిన నీటి గతు లిట్టలమ్మగు ॥విశ్వ॥

శుభ్రవస్త్ర వరయ శుచి కశుదికైనఁ
బ్రీతి పొడము నెట్టి భ్రాతినైన
కంటకింపకున్నఁ గడుపునకించునా ? ॥విశ్వ॥

ప్రకృతిధర్మమునకు బాహిరమ్ముగ నుండి
యెంతవాఁడు కర్జ మెద్దుకొనఁడు
నింగిఁబ్రాఁక నెవఁడు నిచ్చెన వేయునా ? ॥విశ్వ॥

క్రూరకర్ముతోడఁ గొంకక స్నేహమ్ము
సేయనేల ? వానిఁ బాయనేల ?
అదునుదొరికి కాలు కడుగు టదేలరా ? ॥విశ్వ॥

ఇతరు లెఱుగకుండ నే లంచముల మేయు
వానిలచ్చనమ్ము గానఁ బడును
గంచ మెత్తి దాఁపఁ గండలు దాఁగునా ? ॥విశ్వ॥

బాహ్యవేషములకుఁ బదరి లో గొనముల
నిర్ణయించుటంత నేర్పుగాదు.
నల్ల నావు పాలు తెల్లగా నుండవా? ॥విశ్వ॥

జ్ఞానదాత నెవఁడు గమనించినాఁ డయా?
నోరుగలిగి పలుక కూరకున్నఁ
గనులు తెఱవునూవఁ గాళ్ళఁ బూజింతురు ॥విశ్వ॥

"చిత్తశుద్ధి లేని శివపూజ" లొనరింపఁ
బత్రిచేటుగాని ఫలము లేదు
వట్టియుంత్రి మాడ వస్తువు లెటు లబ్బు ॥విశ్వ॥

ఆత్మసుఖము లేని నైశ్వర్య మదియేల?
భర్త యెముక లేర్చ భార్య యేల?
సౌఖ్య మబ్బ నట్టి సంసార మేలరా? ॥విశ్వ॥

అనధికారి వోలె నధికారి మెలఁగిన
దుష్టశిక్షణంబు దొడర దెపుడు
కుట్టనట్టి తేలు కుమ్మరి పుర్వాను ॥విశ్వ॥

మయసభఁ దిలకించి మదిఁగుందు కురురాజు
శకుని రెచ్చగొట్టె సమయ మెఱిఁగి
పుల్లవిఱుపు మాట "పుట్రింతలకు" బాట ॥విశ్వ॥

విద్దె గఱపు వానిఁ బెద్దగా నెంచక
గద్దె నెక్కువాని గౌరవింతురి
లోకతంత్రిమెల్ల నీ క్రియ నున్నది ॥విశ్వ

అచ్చుబోసి విడిచినట్టి యాఁబోతయి
తిరుగువాని కెల్లు తిండిదొఱకు
ఱెక్కలాడకున్న డొక్కాడ నేర్చునా ? ॥విశ్వ॥

దాన ధర్మములకుఁ దావల మైనట్టి
భక్తి యుడిగె నీచశక్తి లెసఁగెఁ
గష్టసుఖము లెన్నఁ గావడికుండలు ॥విశ్వ॥

సరస భావగరిమఁ ఊటలూరు కావ్యముల్
చదువ వేడ్కపడును సరసుఁ డెపుడు
తమ్మితేనె గ్రోలఁ దుమ్మెద చనుదెంచు ॥విశ్వ॥

ఆశ లేనివాఁడె యీశుఁడు ధరలోనఁ
దృప్తి యున్నవాఁడె ధీరవరుఁడు
దీక్ష బూనువాఁడె దక్షుఁడన్నింటను
వినయపరుఁడె తత్త్వవిదుఁడు వేమ !

ఆఱుగురు శత్రువులనోర్చి యాశవదలి
యఖిల జీవులు తనవంటివని యెఱింగి
నిర్వికల్పసమాధిలో నిలిచియుండు
బ్రహ్మనిష్ఠాగరిష్ఠుఁడే బ్రాహ్మణుండు

సూర్యు డస్తమించుచున్నచో సోముకళలు
తరిగిపోయెడు చందాన తత్త్వపరుల
మనసు పరమాత్మ దృష్టిపై మరలెనేని
విషయవాంఛలు క్రమముగా వీగిపోవు.

ఒక్క గాలి పీల్చి యొక్క నీటిని ద్రావి
యొక్క దేశమందె యుండి యిట్టు
లొకరి నొకరు చూచి యోర్వలేకుండుట
మనకు ధర్మమగునె మాన్యులార !

గతిదప్పిన ధృతిదప్పును
ధృతిదప్పిన మతియుఁదప్పుఁ దేహికి నవలన్
స్థితిగతులు తాఱుమాఱై
వెతలందుట నిక్కమయ్య వేమనవర్యా !

చెడి పిడుక లేకునప్పుడు
తడిసి గుడిసె కట్టునపుడు తాతలు తండ్రుల్
విడువక చెప్పిన నీతులు
దృఢముగ నీలోనమార్పు దేరవె ! వేమా !

మనసిచ్చి మాటలాడఁడు
కనువిప్పి కనఁడు పరుల గర్వాంధుండై
చన వెఱుఁగఁడు నరుఁడకటా !
యనువుగ నధికారభూత మావేశింపన్.

నీవు చెడిపోవుచుండిన నిన్నుఁ జూచి
హీనుఁడని హేళనము సేయు నీ జగంబు
నీవు మేలొందుచుండఁగా నిన్నుఁ గాంచి
యోర్వలేకుండు లోక మహోమయంబు.

ఈశ్వరాజ్ఞచేత నీ జగంబున నేది
యెప్పుడెట్లు లగునో యెవ్వఁ డెఱుఁగు
దాని నెంచలేక తనశక్తియే యని
విఱ్ఱవీగుచుండు వెఱ్ఱినరుఁడు

ఎంతగొప్ప సంస్థనేనియు స్థాపించి
యందఱాదరింప నందమగును
ఇంటికొక్క పుష్పమిచ్చిన శివునకు
నొక్క హారమగుట నిక్కమయ్య.

తోఁకచుక్క వోలెఁ దోఁతెంచు పెఱభాస
లమ్మ పలుకుకెంతో హానిగూర్చుఁ
బొలమునందుఁ గలుపు పూర్తిగాఁ బెరిగిన
నసలుపంట తగ్గు టరుదె చెపుమ ?

తెనుఁగుభాష యనెడు తేనెతుట్టెను బెట్టి
ఈఁగ లొక్కటొక్కటి యేగుచుండెఁ
దొనఁకులాడఁ దొడఁగెఁ దుట్టెనిండుగఁ దేనె
మనుజులార ! రండు మధువుఁ గ్రోలఁ.

సత్కవీంద్రులు పుట్టని స్థలములందుఁ
గొద్దిచదువరి నే యెంతొ పెద్దయండ్రు
చెట్టుచేమలు పెఱుగని పట్టులందు
నాముదపుమొక్క వృక్షమైయలరు టరుదె ?

మాతృభాషామృతంబును మదినిరోసి
యన్యభాషల కెగఁబ్రాకు నాంధ్రులగతి
తల్లిపాలను విడనాడి పిల్లవాండ్రు
బుడ్డిపాలకు మూఁతుల నొడ్డినట్లు.

ఎవరిభాష నశించునో హీనమగునొ
ఎవరిసంతతి నిర్వీర్యమవునొ వార
లైక్యగతిఁబాసి పెడబుద్ధులావహిల్ల
దాస్యశృంఖలమునఁ జక్కి తల్లడింత్రు.

భాషయనియెడియాకాశ పథమునందుఁ
బండితకవీంద్రబృందమన్ పక్షిసంఘ
మెగురు శక్తి కొలంది నింకింతె కాక
యాకసంబంతఁ గ్రుమ్మర నలవియగునె ?

భవ్యశాస్త్రార్థ విదుఁడగుఁ బండితుండు
కళ నుపాసించునాతఁడు కవివరుఁడగు
రెండు నొకచోటఁబెనఁగొని యుండెనేని
యందమగుపూవు తావితో నమరినట్లు.

పక్షపాతంబుతో వ్రాయు వ్రాతలందు
జ్ఞానమజ్ఞానకలితమై కళతఱుగును
వెలుఁగుతో నల్లపొగయును వెడలఁగ్రక్కు
గబ్బునూనె తిల్లికకొడి గట్టినట్లు

దేశకాల పాత్రంబుల తీరెఱింగి
చేయఁదగు సద్విమర్శన చేయవలయు
నిజము వచియింప సత్కీర్తి నెగడుననుట
యేటి కెదురీఁదినట్లుగా నెంచవలయు.

ఆశయంబుల నభిమాన మంకురింపఁ
గథను నొకకొంత మార్చును గవివరుఁడది
తత్త్వవిజ్ఞానమను సూక్ష్మదర్శని గల
ఘనవిమర్శక దృష్టికే కానఁబడును.

ఎంత పాండిత్యధనమున్న నెట్టిఁడైన
కపటహృదయుండు సత్కీర్తిఁ గాంచఁబోఁడు
పొట్టలోపల పురుఁగులు తెట్టగట్ట
నత్తిపండంత పూజార్హ మని రటయ్యా?

ఆవిరిగ మాఱు జలముల నాని మేఘుఁ
డిలకు వర్షముగాఁ దిర్గి యిచ్చునట్లు
శాస్త్రపుష్పరసంబుల సంగ్రహించి
కావ్యసుధ నిచ్చు సత్కవి ఘనుఁడు కాఁడె?

చిలుక నేర్పినమాటనే చెప్పఁగలుగుఁ
గాని సమయానుకూలత కలుగఁ బోదు
మానవున కింక నేర్పిన దానికంటె
ననుభవజ్ఞానమున నూహ లధికమగును.

పాలు నీరును గలసిన భంగి మంచి
చెడ్డ లుండెను గ్రంథాల సిద్ధమగుచుఁ
బరమ హంసగ మాఱిన నరసుఁ డెపుడు
పాలు గ్రోలుచు నీటిని బాయఁ గలఁడు.

మతముపేర నమాయిక మానవులను
మోసగించుచు నున్నారు దోస మనక
యట్టి మాయను దెలియలే నంత వఱకు
భావదాస్య విముక్తిని బడయలేరు.

శాంతి బోధకుడైన వేదాంతి మాట
వినదు లోకము మోసమ్ము విశ్వసించు
గొల్లవానిని నమ్మదు గొఱ్ఱె యెపుడు
కటికివాఁడన్న దానికి కాంక్ష మెండు.

అంటరానితనం బగ్ని కంటగట్టి
తోడివారలనెంచు నీతోడులనుచు
నట్లుగాకున్న సరియైన యాత్మశాంతి
కలుగఁ బోదింక నెన్ని యుగాలకైన.

గొప్పవాఁ డెవ్వఁడైనను గోచరింప
నతని కుల మెద్దియని పల్కు హైందవుండు
తన కులజుఁడైన యతని ఘనతఁ జాటుఁ
గాకయుండిన లెక్కగాఁ గైకొనఁడు.

ఒకఁడు ఘనకార్యమును జేయుచున్న నొకఁడు
భంగమును జేయఁ జూచియుఁ బతితుఁ డగుచు
వంకలనుబెట్టు, నందని పచ్చిద్రాక్ష
పుల్లగానుండు ననుటది కల్లగాదు.

నిలువు లడ్డాలు మొగమున నిక్కనీల్గి
పెట్టినను జేతితోనింత పెట్టకున్నఁ
జేరఁబోదెన్నఁడును లచ్చి, చెట్టువేసి
పెంచకుండిన ఫలము లభింపఁ గలదె?

పలువురొక పని సాధింపఁ దలపడినను
ఘనులె యంతముఁ గనుఁగొనఁ గలరు; కడలిఁ
జిన్న యలలన్ని నడుమనే చితికిపోవ
దొడ్డకెరటాలు మాత్రమే యొడ్డుదాఁకు.

అణఁగి చరియించు సజ్జనుఁ డతిమృదువుగ
నధము డెప్పుడు నిక్కిపై నాడుచుండు
ప్రాణవాయువు క్రిందుగా వచ్చుచుండఁ
బోవు పైభాగమున బొగ్గుపులుసుగాలి.

ఉత్తములతోడ సహవాస మున్నయెడల
సద్గుణంబులు గలుగుట సాజమయ్య!
చెంత జందనవృక్షంబు చెలఁగియున్నఁ
జెట్లులన్నియు నాతావి జిమ్ముటరుదె?

కష్టములు తీరినంతనే కలుగు సుఖము
విలువ యెక్కువగాఁగల్గి యలరుచుండు
మండువేసవి యెండకు మాడిమాడి
నిమ్మనీడను జేరు సుఖమ్మభంగి.

ఎచటఁ బుట్టిన జీవికి నచట నెట్లొ
యీశ్వరుఁడు జీవనంబుఁ జూపించినాఁడు
కాకయుండిన ఱాతిలోఁ గప్పయెట్లు
బ్రదుకుచుండును నారోగ్య పథమునందె.

స్నేహితులు తన్ను గొప్పగాఁ జెప్పకున్నఁ
గవివరుండైనఁ గీర్తిని గాంచలేఁడు
ఎంత గారడివాఁడైన నెఱిఁగి మనుజు
లెట్లు వత్తురు డోలు వాయింపకున్న.

హృదయ మర్పించునట్టి స్నేహితుఁ డొకండు
చాలు మన మేలుకోరుచు సాయపడఁగ
పిచ్చిమొక్కలు పదివేలు పెఱుగనేల
కాయ లిచ్చెడి వృక్ష మొక్కటియె చాలు.

ఎందఱో పుట్టి పెఱిగి నశించుచుండఁ
ద్యాగపురుషుల జీవిత భాగములనె
చెప్పుకొనుచుంద్రు భక్తిపై గొప్పగఁ బ్రజ
తావిగల పూవులనె తలం దాల్చినట్లు

తొలుత మాపూర్వు లందఱు దొడ్డవార
లనిన నెందాక గౌరవ మబ్బు మనకుఁ
జెట్టు పేరును గొప్పగాఁ జెప్పుకొనుచు
నెందనుక పండులను విక్రయింప గలము.

తల్లి గర్భములో నుండి ధరణిఁ బడిన
క్షణము మొదలుగఁ గడపటి క్షణము వరకు
లోకజాలములోఁ దగుల్కొనును నరుఁడు
బూజులోఁ జిక్కి తపియించు పురుగువోలె

తనదు లోపంబులను దిద్దుకొనకయున్న
పరుల తప్పుల నెంచుట పాడియగునె
అచ్చపుం గాజుమేడఁ దా నధివసించి
యితరులను ఱాలుఱువ్వుట హేయమగును.

ధర్మసంస్థాపనము సేయఁ దగినయట్టి
రాజు లేకున్న సాధు సంరక్ష లేదు
ముండ పెంచిన బిడ్డయు, ముక్కుఁద్రాడు
లేనియెద్దును హద్దాఁక లేకయుండు.

పాపపూరితమైన సంపాదనమ్ము
చీడపురుగులోఁ బెఱిగెడి చెట్టువోలె
ననుభవించుట కేమాత్ర మనువుపడని
చెడుఫలంబుల నొసఁగి నశించుటరుదె !

ఎంతవాఁడైన దారిద్ర్య మొసఁగియున్న
గుణవిహీనుని చందాన గోచరించు
సింహమైనను బోనులోఁ జిక్కియున్న
సగము చచ్చిన రీతిగా నగపడదొకో !

ఉత్తమ సతీమతల్లి తా నొళవు మీఱి
భర్త యడుగులలో నడ్గు వైచుచుండు
సిద్ధ గురుమార్గవర్తియా శిష్యునట్లు
శ్రుతుల వెన్నంటి సాగెడి స్మృతులవోలె.

ఎంత యాకార గాంభీర్య మొసఁగియున్న
సతి పతికి లొంగియుండుట సహజమంద్రు
కడవ వలె నున్న గుమ్మడి కాయమైన
గత్తిపీటకు లోకువ కాదఁటయ్య !

చెప్పు మాటలకును జేయు చేఁతలకును
బొసఁగకుండిన నభివృద్ధిఁ బొందరెపుడుఁ
జెనఁటి శ్రీరంగనీతులు చెప్పినంత
వినెడివారెట్టులద్దాని విశ్వసింత్రు !

గృహిణిగుణములు సవరింప కేగృహంబుఁ
జక్కఁజేయఁగనెంచుట సరియగు నొకో!
యుసలువస్తువు వంకర నట్లెయుంచి
దానినీడను సరిచేయఁ దలఁచినట్లు.

కలవానిచెంత నక్కఱ
గలవాఁడు ఖలుండుచేరి ఘనదానమ్మల్
సలుపుటకడ్డై నిలుచును
ఫలభూజముక్రింద గొప్పపాముస్నక్రియన్.

స్థిరముగఁ బ్రశాంతిఁ గోఁరెడి దేశమెపుడు
సిద్ధపడి యుండఁదగు ఘోరయుద్ధమునకుఁ
బంటవలఁతిని రక్షింప వడెసెలయును
దండమును గాఁపు ధరియించి యుండవలయు.

తెవ్రులులేని యాత్మ దేహియై ధరఁబుట్టి
పాపపుణ్యఫలముఁ బడసినట్లు
వాసన రుచి రంగు వాననీటికి లేవు
పుడమిఁబడిన వానిఁ బొందఁ గలుగు.

క్రోధపూరిత హృదయుండు కోపగింప
శాంతుఁడు ప్రశాంతి విడఁడు. భాస్కరుని మిగుల
ఉష్ణకిరణంబులే సోఁకు చున్నఁ దనదు
చల్లని వెలుంగు కిరణాలు శశియొసంగు.

సూత్రమదేమొ ? ప్రజాపతి
క్షేత్రజ్ఞుండౌచు నేమి చేసెనొ తొలుతన్
*" నత్రజని భ్రమణము " వలెఁ
జిత్రమ్ముగఁ దోఁచు లోకసృష్టి గణింపన్.

కుజనుఁడు కుతర్క మొనరింప సుజనుఁ డెపుడు
సామనస్యమ్మునన్ సత్యసార మెఱుఁగు
బంభరము పూవుఁదేనెకై పరువు లిడఁగఁ
బేడ కాశింప దయ్యె ? " బొంబోడి " పురుగు.

మనసు సన్మార్గ మందుట మాత్రఁ గష్ట
మది కుమార్గమునం జేయు టశ్రమంబు
బండ నలకొండ మీఁదికిఁ బఱపుటన్నఁ
గష్టతర మది విడచుట కడుసులభము.

నిప్పుల కుంపటి యైనది
యప్పా ! సంసారభార మతిదుర్భర మే
చొప్పునఁ దరింపఁ గల నని
తప్పక క్షేత్రజ్ఞుఁ డాత్మతత్త్వము వెదకున్.

ధన ఋణ విద్యుత్తులచే
మన కీలోకంబు గలిగె మహిమాఢ్యంబై
అణుధర్మ మ్మరయ నయ్యది
అనుమానమ్ములం దొలంచు నయ్యా ! వేమా !

---

* Nitrogen cycle

అఖిల విజ్ఞానపేటి గ్రంథాలయమ్ము
కల్పమటు దివ్యఫలములఁ గలుగఁ జేయు
లలితకళల వినోదాలఁ గులుకు ఘనులు
దానధారలఁ బోషింపఁ దగదె దాని.

కావ్యకల్పలతను ఘనులు పోషించుచో
అమరఫలములెన్నొ యది యొసంగు
ధీరవరులు వానిఁ దిన నర్హులగుదురు
విశ్వవినుతచర్య ! వేమనార్య !

జ్ఞానభిక్షపెట్టు గ్రంథాలయము లెప్పు
డుండి తీరవలయు నూరనూర
దానఁ చాలవఱకు జ్ఞానపోషణ గల్గు ॥విశ్వ॥

ఓర్పునేర్పులరసి యొక్కఁడింకొకనికిఁ
దప్పకుండ విద్య సెప్పెనేని
చదువురానివాఁడు జగతిఁ గన్పడఁబోఁడు ॥విశ్వ॥

పెద్దవాఁడనైతి విద్దె నాకెటులబ్బు
నంచుఁ దలఁచుటెన్న నధమగుణము
గుణియెనిల్వ విద్యకూడదా తగినంత ॥విశ్వ॥

పుడమిఁ బడినదాది కొడుకుల కూఁతుల
గుణము చక్కదిద్దు గురువు తల్లి
తల్లిచదువుకొన్న పిల్లలకే మేలు ॥విశ్వ॥

కష్టసుఖములందుఁ గలిమిలేములయందు
మంచివారి గుణము మాఱదెపుడు
చెఱకు తియ్యఁదనము నఱికినఁ బోవునా? ॥విశ్వ॥

సుకృత దుష్కృతముల నూటిగ నెఱిఁగింప
ఆత్మయుండఁ బనుల నడుగనేల?
ముకురమేల? కడెము ముంజేతనుండఁగ ॥విశ్వ॥

ఆడితప్పఁబోకు మప్పుసేయఁగ బోకు
పరులమనసు కష్టపఱుపఁ బోకు
కొంటెచేష్ట మాను కొండెముల్ మానరా. ॥విశ్వ॥

మంచినెంచలేని చంచలచిత్తుల
మనసుతెలిసి యెవఁడు మసలఁ గలఁడు?
పిచ్చివాని చేతి బెడ్డటు పోవునో ॥విశ్వ॥

చెడ్డమూక నింత దొడ్డవాఁ డొకఁడున్న
నెంతొ మంచికీర్తి నెసఁగుచుండు
నలుపుపక్కనున్న తెలుపువెల్గిన యట్లు ॥విశ్వ॥

శ్రద్ధతోడవినినఁ జక్కఁగాఁ దెలియును
మనసు నాటుకొనును మననమునను
ప్రజకుఁ దిరిగిచెప్ప ప్రజ్ఞాధికుండగు ॥విశ్వ॥

ఉన్నవేళ మనసు తిన్నఁగా నుంచక
లేమివేళ నేడ్వ నేమికలుగు?
కట్టఁ దెంచి నీరు కలువైన దన్నట్లు ॥విశ్వ॥

కార్య సాధకుండు కష్టవారిధు లీది
తలఁచుకొన్న పనులు సలుపుచుండ
ఒడ్డు నున్నవాఁడు గడలువేయురా ॥విశ్వ॥

దాన ధర్మములకుఁ దగినంత యొసఁగిన
లోటుపడు నటంచు లోఁదలఁపకు
చెలమ తీయుకొలఁది జలమూరుచుండదా? ॥విశ్వ॥

ఆలు మగల మనసు లతుకకుండిన యెడ
జీవితమున రసము చిప్పిలదయ!
జంత్ర గాత్రములకు జతగూడ కున్నట్లు ॥విశ్వ॥

గడ్డవెనుక పెద్దగడ్డ వేయుచు నున్న
సరసునదుమ పాచి చనును కడకు
మంచిమాటలు విన మనసు నిర్మలమగు ॥విశ్వ॥

పుణ్యములకొలంది పురుషుండు లభియించు
దానమునకుఁ దగిన తనయులంద్రు
పిండికొలఁది గాక పెఱుగునా రొట్టెలు? ॥విశ్వ॥

తగిన దిట్టమైనఁ దరిదప్పఁ గీడ్పడు
చిక్కనట్టి లేడి చిక్కె నన్న
కాళ్ళు లేకకాదు కాలము వచ్చిరా ||విశ్వ||

చక్కనమ్మమేను చిక్కిన సొబగగుఁ
గాంచ ముద్దగు శశికళ తఱిగియు
ఎలుఁగు మంచిదైన నేఁడ్చిన నింపగు ||విశ్వ||

అల్పుఁడాచరించు స్వల్ప దోషంబుల
గొప్పవాఁడు సేయు గొప్ప తప్పు
ఎంత దివ్వెక్రింద అంత చీఁకటియుండు ||విశ్వ||

తొండమున్న మాత్ర దోమ యేనుఁగుకాదు
ఱెక్కలున్న నీఁగ పక్కిగాదు
పెద్ద మచ్చలున్న పిల్లి బెబ్బులిగాదు ||విశ్వ||

క్రిందివాఁడు తనకుఁ గీడు సేయండని
తలఁచెనేని హాని కలుగుఁ గర్ణు
చావుకొఱకు జరిగె శల్య సారథ్యంబు ||విశ్వ||

అండ యున్నదంచు నదరిపడెడువాని
నణఁగఁ ద్రొక్కఁదలఁతు రదనెఱింగి
కొండెమీటు తేలుఁ జెండరా కసితోడ ||విశ్వ||

ఉట్టి గట్టి నిరత మూఁగు లాడఁగ బోము
మాటమనును, తనువు మట్టిపాలు
మాట దక్కనేని మూటయు దక్కురా ||విశ్వ||

కన్నతల్లికంటెఁ గల్పవృక్షము లేదు
తగిన భార్యకన్న దాసి లేదు
పరమ గురునికంటె బంధువే లేదురా ||విశ్వ||

కూడు గుడ్డ కొఱకుఁ గుందెదు నిఱుపేద
చదువు సంధ్యలకెటు శ్రమపడునయ
పాదహీనుఁ డెట్లు పరుగిడ నేర్చును? ||విశ్వ||

మిత్రులట్లమెలఁగు శత్రువులుందురు
ఎఱుకగలిగి సంచరింపవలయు
తులసిమొక్కవోలె దురదగొండియు నుండు ||విశ్వ||

పాలనిచ్చుచుండుఁ బచ్చికఁదిని గోవు
పాలుద్రావి విసముఁ బామొసంగు
ఉత్తమాధమగుణ ముండురా యిబ్భంగి ||విశ్వ||

తనకుమాలినట్టి దానధర్మముసేయఁ
బూని నెగ్గలేఁడు; తానుదూఱ
వీలులేనియపుడు డోలొందు మెడకేల? ||విశ్వ||

పతియె దైవమంచు భావించు చక్కని
సతి లభింప వేఱె స్వర్గమేల ?
ఇచోటకన్న స్వర్గమింకెట నున్నది ? ॥విశ్వ॥

సంశయాత్ముఁడెపుడు జయమొందజాలఁడు
సంతసంబె మనకు సగము బలము
సాహసమున లక్ష్మి సంప్రాప్తమగునండ్రు ॥విశ్వ॥

దేవుఁడెచటనుండుఁ దెలియఁ జెప్పుమటన్న
ఏమిసెప్పఁ గలుగు నెవ్వఁడైన ?
నమ్మునట్టివారి నెమ్మనంబున నుండు ॥విశ్వ॥

పడవనడుపువాడు పడుగుచేసెడివాఁడు
గాలివాటమెఱుఁగఁ జాలకున్న
గ్రుడ్డియెద్దు చేను బడ్డ రీతిగనుండు ॥విశ్వ॥

తల్లిదండ్రులనెది పిల్లలు ప్రశ్నింప
ఒప్పులరసి విప్పిచెప్పవలయు
సాఁగుచున్న లతకు సరిగ పందిరి వెట్టు ॥విశ్వ॥

కాలుచుండి వెల్గుగ్రక్కుచుండునువత్తి
ఎండనుండి నీడనిచ్చువృక్ష
ముత్తముండు కష్టమోర్చి మేల్సేయురా ॥విశ్వ॥

ఎన్నో రూపములుగ నెసఁగు విశ్వంబెల్ల
బ్రహ్మమయమె కాని పరముగాదు
రంగులన్ని తెల్లరంగులో నున్నట్లు ॥విశ్వ॥

వినవారికింత యాకులో వడ్డించి
కానివారలకిడు కంచమునను
లోకమునకుఁ దెలివి లోటెంత కలదురా ॥విశ్వ॥

అనుభవజ్ఞులైన యార్యులు యోచించి
చెప్పినట్లు పనులు చేయవలయు
ఎఱుకలేక సలుప ఏకు మేకౌనురా ॥విశ్వ॥

చీడపుర్వు చెట్టుఁ జెడఁదినునేగాని
పుడిసెడైన నీరు పోయలేదు
దుష్టుఁ డౌరులఁ జేరి ద్రోహమే సేయురా ॥విశ్వ॥

ప్రక్కయింటివాఁడు బాగుపడుచునుండఁ
జూడలేనివాఁడు శుద్ధపశువు
పశువుకైన కొంత పరమార్థమున్నదే! ॥విశ్వ॥

శక్తివంతుఁడైన సమయము విమమింప
దగ్గియుంట విహితధర్మమగును
మట్టియాకుమీద కట్టివేల్పున్నట్లు ॥విశ్వ॥

ఎముకలేని చేయి అమృతమొలుకు వాయి
గల మనీషికేమి గలుగదయ్య!
అట్టు నిచ్చినమ్మ కట్టున్నరీయరా ||విశ్వ||

ఎగ్గుసిగ్గులేని హీనులతోఁ జెల్మి
చేసెదేని కడకుఁ జేటుగల్గు
కోఁతిమూఁక జేర కొంపలు జెడునయా ||విశ్వ||

చెవిటివాడు పరులు చెవిటివారలు నాఁగ
పెద్దగొంతుతోడఁ బిలిచి చెప్పు
ఎట్టివారికి పరులట్టివారుగఁ దోఁచు ||విశ్వ||

పరులయాస్తి చూచి పరితపింపఁగనేల
తనకు లేదటంచు గోణఁగనేల?
తొత్తువోలెఁ జేసి దొరవలెఁ దినవలె ||విశ్వ||

మురుఁగునీరు నిల్వఁ బురుగులుపుట్టును
గోరుపెఱుఁగ మడ్డి జేయుచుండు
కోపమడరెనేని పాపము మొలకెత్తు ||విశ్వ||

నీతులెన్నొ చెప్పి చేఁతలు లేకున్న
ఫలమొకింతయైనఁ గలుగఁ బోదు
మందుపేరుసెప్ప మాయునా వ్యాధులు! ||విశ్వ||

పెద్దవారిలోన యొద్దిక చెడిపోవ
పిన్నల కది పుట్టి పెరుగుటెట్లు?
రాజుగుణముఁ బట్టి రైతుగుణంబుండు ॥విశ్వ॥

పెద్దకొడుకు మీఁదఁ బ్రేమ తండ్రికి మెండు
తల్లికుండు చిన్న తనయు మీఁద
మధ్యములను గండ్రి మధ్యస్థమగుదయ ॥విశ్వ॥

అత్తపోరుకంటె ఆడుబిడ్డల పోరు
ఎక్కువగును కొన్ని యిక్కలందు
అసలు మందుకంటె అనుపానమెక్కువ ॥విశ్వ॥

హానికరములైన యవసరమ్ముల యందు
బాటఁ దప్పనేని భంగపడును
రేవువిడిచి దిగినఁ జావు తిప్పలుగల్గు ॥విశ్వ॥

వేశ్యవిటుల కొఱకు వేషభాషలఁ బైకి
మెఱుపుఁజూపు మనసు మెఱుఁగుబాపు
కొప్పునిండ పూలు కొప్పువిప్పిన పేలు ॥విశ్వ॥

బిగువుసేయఁ దీఁగ తెగిపోవు వీణకు
వదలుచేసేదేని పలుకఁబోదు
సరిగఁ గుదురకున్న సంసారమంతెరా ॥విశ్వ॥

తగినకృషి యొనర్చి ధనవంతుఁడగు నొండు
తండ్రివలనఁ గలుగు ధనమొకనికి
పెట్టు శాస్త్రియొకఁడు పుట్టు శాస్త్రియొకండు ॥విశ్వ॥

పరులసొమ్ము తినెడి పాపాత్ములకు స్థాయి
కలుగఁబోదు జయము నిలువఁబోదు
పరధనమ్ముకంటె గరళము మేలురా ॥విశ్వ॥

గంజినీళ్ళకేని కఱవైన యుప్పుడు
పట్టుబట్టలేల కట్టవలయు
మింగమెతుకు లేదు మీసాల కత్తెరా! ॥విశ్వ॥

బలము చాలనపుడు పాండవులుండిరి
పొసఁగ ఏకచక్రపురమునందు
నలిగియున్నవేళ తొలఁగి యుండుట మేలు ॥విశ్వ॥

కండ క్రొవ్వుకలిగి కవియు దుర్మార్గుండు
సాధు రక్షణకెటు సాయపడును?
మేలుకోరి వృకము మేకను కాయునా? ॥విశ్వ॥

పద్మరేఖలున్న పాదము కుంటిదే
ఐన మంచి దశకు హానిలేదు
కాలుకుంటిదైన కడుపెట్లు కుంటిది? ॥విశ్వ॥

సమునిమీఁద తనదు శౌర్యంబు చూపక
మ్రొక్కువాని సణఁగఁ ద్రొక్కుటరయ
బడుగుపిచ్చుకవయి బ్రహ్మాస్త్ర మేయుట ॥విశ్వ॥

ఓనమాలుచదివి ఆనవాలును జూడు
గురుని మాటమీఁద గుఱిని నిలుపు
విన్నవానికంటె కన్నవాఁడె ఘనుఁడు ॥విశ్వ॥

తాఁనె శకునిగూడి ధర్మజుతో జూద
మాడ కౌరవేశుఁ డరుగుటరయ
పిల్లిఁజంకఁ బెట్టి పెండ్లికిఁ బోవుట ॥విశ్వ॥

ఇచ్చకంబులాడి యుచ్చులోఁ బడఁద్రోయ
నవ్వి దువ్వి ఖలుఁడు నటనసేయు
నోరు మాటలాడ నొసలు హేళనచేయు ॥విశ్వ॥

నేలమీఁద బడిన నిముసమ్ము మొదలుగా
ఊరక తరిగిపోవుచున్న ఆయు
వోటికుండలోని నీటి విధంబుగా ॥విశ్వ॥

శిక్షకాజ్ఞనీయు దక్షత గలవాఁడు
చెప్పినట్లు చేయు చెనఁటిగూడ
చెప్పుక్రింది తేలు చెప్పినట్లుండదా! ॥విశ్వ॥

నోరు మంచిదైన ఊరు మంచిదియగు
తిండిపుష్టి యున్న కండపుష్టి
ధర్మబలము గల్గ దైవబలముగల్గు ॥విశ్వ॥

చిన్నచిన్న దోసగులెన్నొ కన్పడకుండు
దాతకుండు గొప్ప దానమహిమ
సూర్యుడున్న యపుడు చుక్కలు తోఁచునా? ॥విశ్వ॥

సద్గుణముల వృద్ధి చాలకాలము పట్టు
చెడుగుణాల పెంపు శీఘ్రమ యగు
ముండ్లచెట్టె పెరుగు పండ్లచెట్టునకంటె ॥విశ్వ॥

అధిపులొందుచుండు రధిక కష్టసుఖాలు
ఎంతచెట్టు కుండు నంతగాలి
అబ్ధి కున్న పెద్ద అలలు కాల్వకు లేవు ॥విశ్వ॥

చెప్పఁదగినమాట చెప్పఁదగనిమాట
తెలిసి పరులతోడఁ దెలుప వలయు
పెదవి దాటెనేని పెన్నయు దాటురా ॥విశ్వ॥

ఎండమావులందు నుండదు నీరమ్ము
నేఁతిబీరలోన నేయి సున్న
వేశ్యవలపునందు ప్రేమ శూన్యంబురా ॥విశ్వ॥

✓ ఎవరి తప్పు వారెఱుఁగంగఁ జాలరు
పరుల తప్పు పట్టఁ బడయుచుందు
ఎవరి వీపు వారి కెట్టుల కన్పడు ॥విశ్వ॥

జోలిమాలిన పని జోక్యంబు కల్గించు
కొనుట, హానికరము మనుజులకును
మేకు పీఁకి కోఁతి మిత్తి వాతం బడె ॥విశ్వ॥

వర్షయోగమునకె వచ్చు తూనీఁగలు
తోఁచు కీడుకొఱకె తోఁకచుక్క
చెడెడు కాలమునకె చెడ్డ బుద్ధులు పుట్టు ॥విశ్వ॥

పెద్దవారితోడ నొద్దిక విడనాడి
మాటలాడెదేని చేటుగలుగు
కన్ను బోవునంత కాటుక యేలరా ॥విశ్వ॥

ప్రాణవాయువున్న ప్రజ్వలించును దివ్వె
స్పర్థయున్న విద్య సరిగఁ బెఱుఁగు
వాన కురియుచున్న వరదలు వచ్చురా ॥విశ్వ॥

ఇంట పెద్దవాఁడు తుంటరి యైనచో
చెనఁటు లగుట కేమి? చిన్నవారు
కోడలు నలుపైన కులమెల్ల నలుపురా ॥విశ్వ॥

ఉన్నవారిచెంత నొద్దికతోఁ జేరి
మాటనేర్పుచేత మనెడివాఁడు
గాదికిఁ్రింద నున్న గరిమిడికొక్కరా ॥విశ్వ॥

ఊరకున్నవాని కూరెల్ల నోపదు
భూషణంబు సత్యభాషణంబు
కట్టులేని నోరు గట్టు తెగిన యేరు ॥విశ్వ॥

నీతిమార్గమందు నీవు చరించుచు
ఒరుల కది వచింప ఉచితమగును
మొదట నిల్లు గెలిచి పిదప రచ్చం గెల్వు ॥విశ్వ॥

కలిమి లేని వేళ కాసుచేయని వాఁడు
కలిమి గలుగ రాజఘనతఁ గాంచు
ధనము మహిమగాని తనమహిమా యది ? ॥విశ్వ॥

పెంకెవాని మనసు బింకంబు తెలియక
హితము చెప్పెదేని యెగిరి పడును
ముద్దుగొన్న కుక్క మూతి కఱచినట్లు ॥విశ్వ॥

ఆత్మలేనివాని కాచారములు మెండు
అల్పమతికి సంశయములు పెక్కు
వట్టి గొడ్డు కఱవు "లాట్టె" పుట్టుచునుండు ॥విశ్వ॥

వృద్ధుఁడయ్యు ఘోరయుద్ధాన భీష్ముఁడు
లొంగలేదు వైరిలోకమునకు
బ్రహ్మచర్యదీక్ష బహుళశక్తి నిచ్చురా ॥విశ్వ॥

పరిశుద్ధమైన దేహమారోగ్య ముండక
బుద్ధి వికసనంబు పొందలేదు
చమురులేని దివ్వె చక్కఁగా వెలుఁగునా ? ॥విశ్వ॥

శ్రద్ధయుండెనేని సాధనముండును
సాధనమునఁ బనులు చక్కఁబడును
చక్కఁబడిన పిదప సౌఖ్యంబు గలుగురా ॥విశ్వ॥

దున్న యీనెనన్న దూడఁ దెమ్మన్నట్లు
మాటలాడునట్టి మనుజులున్న
నిజమెఱుంగ కొంత నిలుకడ వలయురా ॥విశ్వ॥

రాజమార్గమందు రక్షణముండును
అడ్డదారి ప్రాణ గొడ్డ మగును
సత్యపథమునందు సౌఖ్యంబు పొసగురా ॥విశ్వ॥

అప్పుచేసియైన పప్పుకూడు తినుట
ముప్పు గూర్చుఁగాని ముదమొదవదు
ఆయమెఱిఁగి నరుఁడు వ్యయము సేయుట లెస్స ॥విశ్వ॥

కష్టపడి ఫలమ్ము గడియించుకొను వాఁడు
పవలు రేయి యనక పాటుపడును
ఈఁతకాని కెంత లోతైన లెక్కయా? ॥విశ్వ॥

పతికి ముదముకూర్చు భార్య గతింపగా
కష్టపెట్టు కలికి గలిగె నేని
తలుపు పోయి కడకు తడికె చేకుఱినట్లు ॥విశ్వ॥

రౌద్రరసము చూపు క్షుద్రు సేవించుచు
ఎంతదనుక పేద యెటు వసించు
ఏటియొడ్డు గుడిసె ఎన్నాళ్ళు నిలుచురా ॥విశ్వ॥

వయసునందు చిన్నవాఁడయ్యు సుజ్ఞాని
పరుల కుపకరించుఁ బలు విధముల
చిన్న దివ్వెచేత ఎన్నో దివ్వెలు వెల్గు ॥విశ్వ॥

బాటసారి యెంత బ్రతిమాలి యడిగిన
బండి వచ్చు తఱిని తిండిపెట్టు
పూటకూళ్ళ తల్లి పుణ్యా మెఱుంగునా? ॥విశ్వ॥

ఒక్క ఱెక్కపాటు పెక్కురు తినునింట
కఱవుగాక యెట్లు కొఱఁత తీఱు
చిన్న నూయి నూఱు చేదలఁ దన్పునా ? ॥విశ్వ॥

కాలుజాఱి తిన్నగా లేచికొన వచ్చు
నోరుజాఱి తీయు దారి లేదు
చేయిజాఱి కుండ చెక్కలైన తెఱంగు ॥విశ్వ॥

వేశ్య యింటిలోన వేదాంత గోష్ఠిని
సలుపఁ దలఁచుటెంత తెలివి లోటు
రొట్టె చేర మేల! బట్టల కొట్టులో ॥విశ్వ॥

ఆతఁడేమిచేసె నీతఁడేమి యొనర్చు
అనుట యెంతకైన అతి సులభము
ఏమి చేసితినని యెంచుకొంటయె గొప్ప ॥విశ్వ॥

మంచి వారలణఁగి మణఁగి వర్తించిన
చెడ్డవాఁడు కీడు చేయుచుండు
చిమట పెట్టెలోని చీరల చింపదా? ॥విశ్వ॥

సారహీన మైన సంసారమునఁ బడి
మాయ దాఁట లేని మానవుండు
జిగురుకండె తగిలి చింతిలు పులుఁగురా ॥విశ్వ॥

బ్రహ్మఁ జూడ విద్యపై భ్రాంతి వాడమును
హరిని గాంచ భోగ మందఁ గోరు
శివుని గన్న మోక్ష జిజ్ఞాస గల్గురా ॥విశ్వ॥

గణిత శాస్త్రభావ గరిమ విమర్శింప
వస్తు తత్వశాస్త్రవాద మరయఁ
దత్వశాస్త్రమునకె తలయొగ్గు చున్నవి ॥విశ్వ॥

గీ॥ మానవుండయి పుట్టిన మాత్రమునను
మానవత్వము గల్గునన్ మాటకల్ల
మానవత్వము గలయట్టి మానవుండె
దైవతత్త్వము సాధింపఁ దగును సుమ్ము.

క్రూరజంతు వోలె గుహలఁ జరించును
సాధుజంతు లుండు సంఘములుగ
సజ్జనుండు సతము సంధిని గోరురా ॥విశ్వ॥

ఇహ సుఖంబుఁ గోరి యే యొండశా గొద్దు
పట్టునతఁడె నరగ బాగుపడును
నిక్కగల్గ సుఖము దక్కుట యరుదురా ॥విశ్వ॥

అప్పులేనివాఁడె అధిక సంపన్నుండు
సత్య మాడువాఁడె సజ్జనుండు
మేలు గూర్చువాఁడె మిత్రాధికుండురా ॥విశ్వ॥

జూదమాడి నలుఁడు ఖేదమ్ము పొందెను
జూదమాడి ధర్మజుండు చెడెను
వారికంటెఁ బుద్ధు పరికింప మొనగాఁడె ॥విశ్వ॥

కసరుకొనెడు వాని కంటెఁ గన్పడకుండ
నాత్మనిగ్రహ్యఁ గలఁడె హానిసేయు
నెండకన్న మూఁగయెండ తీవ్రము మెండు ॥విశ్వ॥

ఎవనియిల్లు వాఁడె శవరించు కొనినచో
దేశమెల్ల సరిగఁ దేజరిలదె?
చెప్పి యెంతవఱకుఁ జేయింపఁ గలవురా? ॥విశ్వ॥

నమ్మి యిచ్చినట్టి సొమ్మెగ వేసెడి
పాపి మోము గనుట పాతకంబు
ధనము పోయినంతఁ దనువెల్ల నొప్పిరా ॥విశ్వ॥

పరిహారవాయు వెపుడు భ్రమియించుటం జేసి
మండలములు తిరుగుచుండు సతము
అదియు నిలిచె నేని యన్నియు నిలుచురా ॥విశ్వ॥

వాన కురియువేళ వలిగాలి వీచును
ఎండవేళ గాలి మందు చుండు
సాహచర్య మెంత సలుపురా గాలిని ॥విశ్వ॥

ఐక్యమున కొకింత హాని గల్గించెడి
జాతి భేద మాట్టై సడలకున్న
సంఘసేవ సేయ సాధ్యంబు కాదురా ॥విశ్వ॥

గాలికంటె రవము కడువేగముగఁ బోవు
దానికన్న కాంతి త్వరగఁ జనును
మనము వేగ మింత యని చెప్పగా రాదు ॥విశ్వ॥

కడప కడప పూజ గావించు వారికి
బుద్ధి నిలుకడెట్లు పొదలునయ్య!
పీనుగాలి కెప్రుడు తోఁచునా యొకతావి! ॥విశ్వ॥

గీ॥ మామ యొకరింటి యల్లుఁడన్ మాట మఱచి
అత్త యొకరింటి కోడలే యని తలఁపక
చిన్నవారికి నీతులు చెప్పుచుండ్రి
పాపటన్ వెండ్రుకలు తెల్లఁ బడినయంత.

గీ॥ పూలు రువ్వినవానిపై ఱాలు రువ్వు
కలుష చిత్తుల కిది మంచి కాలమయ్యె
చెంపఁ గొట్టిన మఱియొక చెంప నిచ్చు
సాధువుల కిప్డు నిల్వఁగ స్థలము లేదు.

గీ॥ పిన్న చేఁపల మ్రింగును బెద్ద చేఁప
పిన్నవారల హింసించుఁ బెద్దవాఁడు
దీనిలోఁ గల మర్మంబు దేవుఁ డెఱుఁగు
బలము గలవారలకె నిల్వ స్థలము గలదు.

గీ॥ ముల్లుతోఁ దీయవలయును ముల్లునెపుడు
ముల్లెతోఁ బొందవలయును ముల్లెనరయ
వజ్రమును గోయవలయును వజ్రముననె
తెలివి చేతనె తెలివిని దెలియవలయు.

కం॥ ఏ విధము చేతనైనను
జీవికి జీవనము గలుగఁ జేసెడి పురుషుం
డే వసుధ పుణ్య పురుషుం
డావుల మరలించువాఁడె యర్జునుఁడు కవీ !

పట్టెడో రెమేరు పెట్టనందునఁ గుక్క
దొంగతనము సేయుఁ దొంగిచూచు
మనుజుకంటె నద్ది మఱవదు మేల్సేయ ॥విశ్వ॥

పుష్పవంతుల ద్యుతి పొల్చు సహస్రార
కమల జనితమైన జ్ఞాన దృష్టి
ఫాలనేత్ర మనుచుఁ బలికిరి పెద్దలు ॥విశ్వ॥

కక్కు వచ్చుచున్నఁ గళ్యాణ మొదవిన
నాఁగఁ బోవ వెవ్వఁ డడ్డమైన
మనుజుఁ డెంత వాని మహిమాతిశయ మెంత? ॥విశ్వ॥

పిన్న వయసునందె పెనిమిటిని గఱవు
చేసికొనిన వనిత జీవితంబు
తల్లివేరు దెబ్బ తగిలిన వల్లిరా ॥విశ్వ॥

గీ॥ పేదవారికిఁ బట్టెఁడు పెట్ట నేడ్చు
పాఁచిపీనుఁగు వేశ్యకుఁ దోఁచిపెట్టు
దానమొక్కింత సేయుఁగ దద్దరిల్లు
దండుగెంతైనఁ బెట్టు నీ ధర్మమేమొ!

ఆడనేర్చువారిఁ బాడనేర్చినవారి
నొప్పులరసి కైత సెప్పువారి
నాదరించు వార లరుదైరి యాంధ్రిని ॥విశ్వ॥

జలము కంటె మిగుల సాంద్రతగల వస్తు
వద్ది మునుఁగుచుండు నప్పునందుఁ
దేలికయ్యునేని తేలురా నీటిపై ॥విశ్వ॥

గీ॥ గ్రుడ్డి గవ్వయుఁ జేయని మడ్డినరుఁడు
దొడ్డవాఁడగుఁ జేతిలోఁ దుడ్డు గలుగ
ధర్మదీక్షకుఁ బ్రాణమ్ము ధారవోయు
పేదవానిని గుర్తింపలేదు జగము.

నరునకున్న యట్టి నాలుగు దశలలో
జవ్వనము వసంత సమయ సమము
దాని వ్యర్థపరచిన ధన్యుఁడు కాలేఁడు ॥విశ్వ॥

సంపెఁగ మధువాన షట్పదమేగదు
కొలిమి తిత్తి కొఱకు కుక్క చనదు
ఆసలేని దెసకు నరుగునా దయ్యము! ॥విశ్వ॥

గుణ విహీనులైన కొడుకులు జనియింపఁ
జేటు గలుగు, చెట్టుచెడెడు కొఱకె
కుక్కమూతి పిందె లొక్కొకటఁ గల్గును ॥విశ్వ॥

సిద్ధ పురుషుఁడైన సిద్ధార్థు వ్యర్థుఁగా
నాడిపోసి విష్ణువనిరి తుదకు
నరములేని నాల్క తిరుగదా యెటులైన ॥విశ్వ॥

భార్య కర్మవశత భర్త దుష్టుండైన
నతనితోడి కష్ట మాలికబ్బు
ఇనుముఁగూడ నగ్గికిని దెబ్బ లబ్బవా? ॥విశ్వ॥

ఇడుమల నెడి వార్ధిఁ బడి చింతపడు వాని
కీడు పెంపుసేయఁ గృషి సలుపుట
బావిఁ బడినవానిపై బండ వేయుట ॥విశ్వ॥

కర్తకంటెఁ గార్యకర్తల రొదహెచ్చు
మూల విగ్రహంబు మూలనుండ
నుత్స విగ్రహాలె యూరేగు చుండును ॥విశ్వ॥

వండుమన్న యమ్మ వాపిరి గొట్టుది
తినుమటన్న యమ్మ తిండిపోతు
ఏదిలేని యమ్మ కేమాట లేదురా ॥విశ్వ॥

రాజు మంచివాఁడేని రాజ్యమొకటె గల్గ
"కూలివాని" కొండు కూలి దొఱకు
గజము కరముఁ బిల్వ గలుగుచో సుక్కను ॥విశ్వ॥

శిల్పి చేతఁబడిన శిల దేవుఁడై వెల్గు
కొండనున్న జాయి కుధర శిలయె
మనుజ మహిమ హెచ్చు మాని శిక్షణకల్మి ॥విశ్వ॥

మొదటిరోజు చాల ముద్దుగా నుండును
మరుదినంబు కొంత మార్పు గలుగు
మూఁడు దినములున్న ముఱికి చుట్టంబగు ॥విశ్వ॥

నందిఁ బందిఁ జేయఁ బంది నఁదిని జేయు
బోకరించి యొకఁడు పొడిచి గెలుచు
నోరులేనివాని కూరెక్క డున్నది ॥విశ్వ॥

రాజకీయమందు మోజు హెచ్చిన వాఁడు
కళల మీఁద దృష్టి నిలుప లేఁడు
నిలిపెనేని యతఁడు నిస్తుల కీర్తియా ॥విశ్వ॥

దవ్వునున్న కఠిను దత్త్వంబు తెలియమి
సరళ హృదయుఁ డనుచు జాటఁ గలవు
తోఁచు నునుపుగానె దూరపుఁ గొండలు ॥విశ్వ॥

భాగ్యమెల్లఁ దొలఁగఁ బౌరుషవంతుఁడు
హీనరూపు నట్లు తానఁ బడును
అగ్ని యారిపోవ బొగ్గు నల్లగదా ॥విశ్వ॥

ఎంత సుస్మితముగ నెద మాఱిపోవునో
అంత దివ్యగుణము లబ్బినట్లు
వసుధ బొగ్గె మాఱి వజ్రమై వెల్గదా ? ॥విశ్వ॥

కష్ట సుఖము లన్ని కడచిన పిమ్మట
ఆత్మబోధ వలయు ననుట జలధి
అలలు నిలువ స్నాన మాడెద ననుకొంట ॥విశ్వ॥

కం॥ ఇల్లాలు రాణి యైనను
వల్లభుపై భక్తిఁ జూపవలయును సుమ్మా
ఢిల్లీకిఁ బ్రభుండైనను
తల్లికి మ్రొక్కంగ వలయుఁ దథ్యము వేమా !

చిన్నతనమునందుఁ జేసిన చేష్టలు
పెద్దయైన పిదప వింతలగును
తెలివి చిత్రమగును గలఁగను దృశ్యముల్ ॥విశ్వ॥

అర్థశూన్యమైన యలజడుల్ గలచోట్ల
నున్నతంపు టూహ లుప్పతిలవు
ఒక్క పక్షి తిరుగ దుఱుముల మెఱుముల ॥విశ్వ॥

కలి యుగాంత మెపుడో తెలుపుము గుర్తన్న
నెన్నొ యున్నవైన నెఱుఁగు మొకటి
పాపులెల్ల నాల్గు పాదాల నడచుట ॥విశ్వ॥

రాగమహిమ చేత ద్యాగమహిమ గల్గె
త్యాగమహిమఁ గల్గె రాగమహిమ
త్యాగ రాగమహిమఁ ద్యాగరాజై వెల్గె ॥విశ్వ॥

శాలి నింటిపేరు కస్తూరి వారని
కొంప గబ్బిలాల కంపు గొట్టు
మాటహెచ్చెగాని 'మానిక పిచ్చరా' ॥విశ్వ॥

బిచ్చమిడిన యమ్మ బిడ్డల గన్నమ్మ
వృథగఁ బోవరెట్టి వేళలందు
ప్రకృతి ధర్మమునకుఁ బ్రతిబింబమే గదా ॥విశ్వ॥

తనదు కాళ్ళమీఁదఁ దానిల్వఁ జాలని
బడుగుమోయఁ గలఁడె వరుల బరువు
లేవలేని యెద్దు లేవి బండినిలాగు ॥విశ్వ॥

స్రష్ట సృష్టియందు శిష్టులు దుష్టులు
జననమొందు చుంట సహజమరయ
జాలరి వలవన్న మీలె పడఁగలవ! ॥విశ్వ॥

హారమందు నిముడు దారము రీతిగా
భర్త మనసులోన భార్యమనసు
కలసి పోయెనేని కలతలు గలుగవు ॥విశ్వ॥

ఊపిరుండఁగానె యోపిన మట్టుకు
దానముల నొనర్పఁ దగును*నరుఁడు
పోవునపుడు రాదు పుచ్చిన వక్కైన ॥విశ్వ॥

సంతుకొఱకు మిగుల చింతించు వారికి
సంతు నొసఁగు టరుదు సంతసింప
చాలునన్న యింట సంతాన మధికము ॥విశ్వ॥

పంచ భూతములకు మించిన పెనుభూత
మొకటి గలదు తెలిసి మెలఁగవలయు
అది దురాశయనుచు నాడిరి పెద్దలు ॥విశ్వ॥

చింతలెల్ల మాని యంతర్ముఖుఁడయి
బ్రహ్మ పథమునందుఁ బరగు యోగి
యిహ పరంబులందు బహుసుఖంబునుబొందు ॥విశ్వ॥

పనులు చెరచునట్టి పంద లెచ్చటనున్న
మాఱఁబోదు బుద్ధి తీరఁబోదు
కోఁతు తెచటనున్న మాఱఁతు లోకులెటుగదా! ॥విశ్వ॥

సత్యమెఱుఁగఁ జేయు సజ్జనుఁ డున్నచోఁ
జక్కఁబడును పెక్కు సంశయములు
అద్దమున్న బొట్టు దిద్దుకో ననువగు ॥విశ్వ॥

తగిన యెరువు పెట్టి తగిన కాలువ త్రవ్వి
తగిన విత్తనములు ధరణిఁ జల్ల
బీడునేలలైనఁ గూడుగుడ్డ లొసంగు ॥విశ్వ॥

గొప్పవాని వ్యాధి గోరడైనను, బెద్ద
ముప్పు వచ్చినట్లు ముసురుకొందురు
బక్కవాని చావు లెక్కలోనికె రాదు ॥విశ్వ॥

దమననీతిఁ జూపఁదగు వారిపై దయఁ
జూపెదేని పనుల సొగసు చెడును
పైత్యరోగి నోటఁ బంచదారయుఁ జేదె ॥విశ్వ॥

కొట్టమందుఁ బొట్లగోడ్డుఁ గట్టుటకంటె
ఉత్తదిగనె కోష్ఠముంట మేలు
కల్లమాటకంటె ఘనమౌనమే మేలు ॥విశ్వ॥

కానికాలమందు గడు జాగరూకత
మెలఁగుచున్న చెట్ల మొలకలెత్తె
కడగఁ బోవు నదియుఁ గాళ్ళమీఁదికె వచ్చు ॥విశ్వ॥

బాలుఁడైన గొప్ప పాపాత్ముఁడైనచో
కఠిన శిక్ష నంతు కనఁగొనఁదగు
కొద్దిపాము నైనఁ బెద్దకఱ్ఱన కొట్టు ||విశ్వ||

వీసు లుద్భవింప విప్లవమ్ము జనించు
వార్ధిమోఁత హెచ్చ వర్షము పడు
తీతు వఱచి యూరఁదీయును బ్రాణము ||విశ్వ||

చదువుకొన్న తల్లి సంసారమును దన
తెలివిచేతఁ జక్క దిద్దుకొనును
కాన విద్య స్త్రీకిఁ గఱపుటయే లెస్స ||విశ్వ||

పూర్వజన్మమందుఁ బొసఁగిన గుణములు
అంతరాత్మఁ గొంత యంటియుండు
నూనె కొలిచినట్టి మానిక రీతిగా ||విశ్వ||

వినయ గుణము వలన విజయంబు చేకూరు
మత్సరంబు నరుల మచ్చమాపు
కలుపుగోలుతనము కళ్యాణ నిలయము ||విశ్వ||

సంఘసేవ కొఱకు సంస్థల నెలకొల్ప
నూఱు మాటలైన నుడువ వచ్చుఁ
'గాణి' యీయుమన్నఁ గష్టమే గలుగును ||విశ్వ||

ఎవరి తిండి వారి కేర్పాటు చేసినట్టి
సృష్టికర్త నరుల సృష్టిచేయు
శిశువు పుట్ట పాలు చేపవా తల్లికి ॥విశ్వ॥

విద్య యున్నచోట విత్తంబు శూన్యంబు
విత్త మున్నచోట విద్య సున్న
రెండు లేనిచోట తిండికే తిప్పలు ॥విశ్వ॥

పుట్టుగ్రుడ్డి లోకమెట్టిదో యెఱుఁగడు
మందుఁ డెఱుఁగఁ డింతి సౌఖ్యములను
ఆత్మతత్త్వమహిమ నజ్ఞాని తెలియఁడు ॥విశ్వ॥

"స్త్రీల కేల విద్య బాలురకే గాని"
యనెడి మాట లోకమరసి కాదు
ఆలు మగనికెన్న నర్థాంగియౌఁ గదా! ॥విశ్వ॥

పనులు చెఱచునట్టి ఘనుఁడున్న మున్ముందు
చక్క మ్రొక్కి పనికి సాఁగి పొమ్ము
ముందె విఘ్నపతికి మ్రొక్కమె పూజలో ॥విశ్వ॥

పూలమాలఁ దాఁకి కాలసర్పంబని
గ్రుడ్డివాడు పొందు దొడ్డ భయము
దయ్యమనిన యట్లు తననీడఁ దాఁ జూచి ॥విశ్వ॥

జ్ఞానబాధముండు దయలేని మనుజుండు
విద్య లేనివాఁడు వింత పశువు
నీతి లేనివాఁడు నీతికంటెను బీడు ॥విశ్వ॥

పాదరసము క్రిందఁ బడినఁ జేఁ జిక్కదు
మనసు కట్టుద్రెంప మరలదు వెస
హోమసేని సరిగఁ బొందరు తేజము ॥విశ్వ॥

ఇరుగు పొరుగు వారి సిరిఁజూచి యేడ్వకు
నీకు భాగ్యమున్న నిక్కఁ బోకు
కష్టసుఖము లొక్క కావడి కుండిలు ॥విశ్వ॥

మోసగాని చెలిమి మోసగాఁ జొనరింపఁ
బలుకు లెన్నియైన ఫలము సున్న
తాలుగింజ చవిటి నేల నాటినయట్లు ॥విశ్వ॥

ఒకని లొంగదీసి యొకఁడు పైకెక్కుట
కుద్యమించు చుండు దుర్వి జనులు
మట్టి తాటి మొదటి మట్టఁ బుట్టిన యట్లు ॥విశ్వ॥

వదులు సుతరమును వడగ్రింగి కెప్పుడు
చీలఁదీసి పగలు నేలు టనువు
శివునిగొల్వ ముక్తి చేరుట సులభము ॥విశ్వ॥

పనిని జేయలేని పందయింటికి దొంగ
సాధు హింసకుండు సభకు దొంగ
సతము బడికిదొంగ చదువని బాలుఁడు ||విశ్వ||

తపసి దివ్యశక్తి దాగియుండును ఆత్మ
వలసి నపుడుకాని తెలియఁ బడదు
నివురు గప్పియున్న నిప్పుచందము గదా ||విశ్వ||

అనెడివేళ నాలుగన్నను సమయాన
కోడలనెడి కరుణ కొంత యుండు
నుత్తముండ కంటె నత్తముండే మేలు ||విశ్వ||

వనములందుఁ గష్టపడుచున్న ద్రౌపదిఁ
బట్టి సైంధవుండు పాటు పడుట
ఊరియు పుండులోన నుప్పు కూరినయట్లు ||విశ్వ||

పరమ సాధ్వియైన పాంచాలి కొఱకేగి
చిక్కెఁ బాండవులకు సింధురాజు
మేయఁ బోయినంత మెడ తగుల్కొని నట్లు ||విశ్వ||

అనుభవించు నేర్పు తనకు లేనప్పుడు
భాగ్య మెంతయున్న ఫలము సున్న
కోతిచేతిలోని కొబ్బరి బొండ్లమే ||విశ్వ||

కన్నవారి కీవు కడుపార బెట్టవే
నీకుఁ బెట్టరయ్య నీ కొడుకులు
తాతనాటి బొచ్చె తరతరాలకు నుండు ॥విశ్వ॥

అవని జాత సీత వైశ్వర్యసముపేత
నిష్కళంక చరిత నింద పడుట
మడుగుఁ జీరయందు మసి దాఁకినట్టులు ॥విశ్వ॥

దుష్టబుద్ధి శకుని దుర్యోధనుని నైపు
జూదమాడి గెల్వ మోదమేమి!
చిలుక కువ్వు గలిపి ఫలమొసంగిన రీతి ॥విశ్వ॥

నిఖిల జీవి వితతి సుఖ దుఃఖములయందు
సమము; క్రియందు సమముగాదు
సింహామునకు గ్రామ సింహాము దీటౌనె! ॥విశ్వ॥

ఆవులావు లెంతో చేవఁ దారసిలంగ
నడుమ లేఁగ కాళ్ళు నలగినట్లు
నృపులు నృపులు పోర నీల్గును నులిసేన ॥విశ్వ॥

తనువునందు బలము తగ్గిపోవక ముందె
భావి సౌఖ్యమునకుఁ బాటుపడుము
దీపముండఁ గానె దెవులాడు కొనవలె ॥విశ్వ॥

ప్రజల మేలు కొఱకు పనిసేయు పీనుఁడు
ఇంటఁ గూరు చుంట కిష్టపడఁడు
పోరుసేయు పుంజు పొదుగునా గ్రుడ్లను ॥విశ్వ॥

వేయిమంది నైన వేష మాకర్షించు
వేసమందుఁ గూడ మోసముండు
కల్మషమును దాచు కాషాయ వస్త్రముల్ ॥విశ్వ॥

పచ్చిగడ్డిఁ జూచి పశువు సంతోషించు
మోహనాంగిని గని మురియు విటుఁడు
అజుని వెల్గుఁ గాంచి యలరును వేదాంతి ॥విశ్వ॥

ఎన్ని లక్షలున్న నేకుల బుట్టకే
ఎఱువు కేగవలయు నెప్పుడైన
లోటులేనివారు లోకంబులో లేరు ॥విశ్వ॥

నీ గుణాల ముందు నిర్మలముగఁ జేసి
చక్కదిద్దు మింటి జనుల గుణము
మొదట యిల్లు గెలిచి పిదప రచ్చను గెల్వు ॥విశ్వ॥

తనువు పోవు వఱకుఁ తగిన యాహారంబు
నెట్లు కోరుకొనునో యట్లె విద్య
వాంఛనీయమాట వయసుతోఁ బనియేమి? ॥విశ్వ॥

మారజిత్తునందు మహిమ యేమున్నది
ఘనులు పొగడుచెల్ల కల్లయనుట
జలజహితునిలోన వెలుఁగు లేదన్నట్లు ॥విశ్వ॥

ఇహము పరము గోరి యీశ్వరారాధన
సలుపువాఁడు మంచి సౌఖ్యమందు
భక్తిపథము పాపముక్తిపథమ్మురా ॥విశ్వ॥

ఒక్క చెవిని వినుచు నొక చెవి విడిచెడి
నీచుఁ డెన్ని విన్నఁ నిష్ఫలంబె
ఎంతవాన కురియ నింకదా యిసుకపై ॥విశ్వ॥

పేదవారిఁ గొట్టి పెద్దవారికిఁ బెట్టి
గొప్పతనము తనకుఁ గూర్చుకొనుట
కాకిమాంసఁ గొట్టి గ్రద్దల కిడుటరా ॥విశ్వ॥

బలమునందు నేన్గు పరుగెత్త గుఱ్ఱము
ఉన్న కొన్నిపనుల నుష్ట్రమెత్తగు
సాయపడదె యొంటె సహారాయెడారిలో ॥విశ్వ॥

గృహిణి పెత్తనంబు గృహమునందుండును
బయటి పెత్తనంబు భర్తకుండు
రెండు సరిగనున్న నిండిన యిల్లగు ॥విశ్వ॥

సూర్యకాంతి యుండి చూడ నేత్రములుండ
అడుగుదీసి యడుగు నిడును గాన
దైవశక్తి వలయు దనశక్తికిం దోడు ॥విశ్వ॥

చెప్పఁదగిన మాట చెప్పఁగూడని మాట
అరసి పరులఁ గూర్చి యాడఁ దగును
పెదవి దాటెనేని పెన్నయు దాటురా ॥విశ్వ॥

కప్పలఱచెనేవి కడవలు నిండును
ఎత్తుగాలి తిరుగ నేరు పొంగు
చూలు గలిగెనేని తేలు చావు నిజంబు ॥విశ్వ॥

సర్వ కార్యములను సాధింప నృపునకు
నొక్క మంచి మంత్రి యుండఁడేని
కొండయంత కరికి తొండము లేనట్లు ॥విశ్వ॥

దుష్ట మానవునకు దూరముగా నుండు
సఖుఁడ వగుట మేలు సజ్జనునకు
మతముకంటె మనుజు మనసె ప్రధానంబు ॥విశ్వ॥

నింద సేసియైన నిద్రాణమైయున్న
జాతి మేలుకొలుపఁ జాలెదీవు
బుద్ధి సెప్పువాఁడు గద్దించి పలుకురా

మంచివారల స్థితి మరణకాలమునందుఁ
జూడుమనుచుఁ బెద్ద లాడినారు
పండు పుచ్చకుండ పడుట మంచిది గదా ॥విశ్వ॥

పాడిపంటలందు పల్లెటూళ్ళె గొప్ప
పట్టణములు గొప్ప పై మెఱుఁగుల
ఆత్మదర్శనమున కడవృతే గొప్పరా ॥విశ్వ॥

ఆశలన్ని విడిచి ఆత్మను బరికించి
మహిని విడుచువాఁడు మరల రాఁడు
సెనగపప్పు మొక్క చేఁ గడిగిన రీతి ॥విశ్వ॥

చమురు వత్తి కలియ సరిగ వెల్గును దివ్వె
వేఱుపడిన రెండు వెలుఁగకుండు
సరస మెఱుఁగకున్న సతిపతు లంతేరా ॥విశ్వ॥

వేరు పాఁకుకొలఁది వృక్షంబు పెరుగును
విద్య పెరుగుకొలఁది వినయ మబ్బు
కలిమి హెచ్చెనేని కనులు నెత్తికి వచ్చు ॥విశ్వ॥

ధర్మమనెడిపేరధర్మమునకుఁ బెట్టి
యెదురు లేనివఱకు నేలఁ గలరు
దశ తొలంగ నెవఁడొ తలకిందు సేయురా ॥విశ్వ॥

నీరు చొఱినన్నైవు వేరు పాఱుచునుండు
వెలుఁగున్నైపై మొక్క తల తిరుగును
జాత నరసి జనులు దరి జేయుచుందురు ॥విశ్వ॥

మనము విడుచు గాలి మహి వృక్షములు పీల్చి
తగిన ప్రాణవాయువుగ నొనర్చి
యిచ్చుచుండు మనకు నీశ్వరు కృపచేత ॥విశ్వ॥

గొల్ల యిండ్లనుండు గొఱ్ఱెల గోత్రాల
వరుస చెప్ప గొల్లవాని కెఱుక
పరమ శివుని లీల భక్తుని కెఱుకరా ॥విశ్వ॥

తెలిసి కలియరాదు కలిసి తెలియరాదు
తెలిసి కలిసిన విడఁ దీయరాదు
అంత్యనిష్ఠురంబు నరయఁగ మేల్గాదు ॥విశ్వ॥

అత్తపత్త్రియాకు హస్తంబు డాసిన
మగని రాకఁ గన్న ముగుదవోలె
ముడుచుకొనును ఎవని ముదల నొదలఁదాల్చి ॥విశ్వ॥

ఉండియుండి తొండ యూసరవెల్లియగా
చేసిచేసి తపము సిద్ధుఁడగును
పండిపండి పెద్దపాము గామానూరా ॥విశ్వ॥

కాలుచున్నకొలఁది కట్టె వేఁడిమిఁగను
చదువుచున్నకొలఁది సారమొలుకు
పొందుచున్నకొలఁది భోగకామము హెచ్చు ॥విశ్వ॥

ఎవ్వఁడేని క్రొత్తదేదైన మొదలిడ
వంకపెట్టుచుంద్రు వచ్చి చూచి
విజయమొంద వారె వేనోళ్ళ నుతియింత్రు ॥విశ్వ॥

ఊర తేరతిండి ఒగి మఠమ్ములఁ బండి
బ్రతుకువాఁడు పనికి వంచఁ డొడలు
బడుగుటింటికంటె గుడి సుఖముగ నుండు ॥విశ్వ॥

మనసు మదము మచ్చుమాపిన సుజ్ఞాని
కోప మంతలోన రూపుమాయు
గడ్డినిప్పు లెంతకాలము నిల్చురా ॥విశ్వ॥

నూలుగుడ్డ నెవఁడు నూఱేండ్లు కట్టఁడు
పండుటాకు రాలకుండ దెపుడు
పుట్టువున్నయపుడు గిట్టుట యుండురా ॥విశ్వ॥

బ్రహ్మశిరము గొట్టి పరమేశుఁడైనను
పునుక బిచ్చమెత్తుకొనఁగ వలసెఁ
గోప మెవరికైనఁ బాపకారణమగు ॥విశ్వ॥

ఒత్తుచుండ్రు జనులు మి[illegible]ానిని
అమిత కఠినుఁబోలి కంత బోరు
రవికిఁ జంద్రుకంటె గ్రహణాలు తప్పవ ||విశ్వ||

ఎఱుకలేమి తనువె యే నని తలఁచుచు
మరణ భయము వలన మది కలఁగుట
త్రాడుజూచి నల్లత్రాఁచనుకొంటరా ||విశ్వ||

పరుఁలు కుంచ నరుఁడు పౌరుషమున్నచో
లేవవచ్చు మించి పోవవచ్చు
ఎంత విసరికొట్ట అంత లేవదె బంతి ||విశ్వ||

పాదు నీళ్ళుపోయ ఫలములు నీ కిచ్చు
కొడుకుఁ బెంచ నిన్నుఁ గొడుకు పెంచు
పిలిచి చక్కఁగా నె పిలిపించుకొనుమురా ||విశ్వ||

సాత్త్వికమున సరిగ సమకూడి నట్టుల
రాజసమునఁ గలిసి రావు పనులు
వేడిగాలి తగుల వాడిపోవు ముఖాలు ||విశ్వ||

పైకిఁ గానఁబడక లోకమాడఁగఁ జేయ
మేనులందు మెఱయు ప్రాణశక్తి
రాగి తీఁగలోన రాజిల్లు విద్యుత్తు ||విశ్వ||

బంతికూటి కోడిపుంజు పరుగిడు ముందుగా
వెట్టిమూట కోడిపుంజు వెనుక నుండు
మనుచు పెద్దలనిరి అది నీ సుఖమునకే ॥విశ్వ॥

వానకాలమందు వలయు కూరలు వేఱు
ఎండకాలమందు తిండి వేఱు
అట్లు కానియెడల నారోగ్యమే మాఱు ॥విశ్వ॥

ఇంటనున్న నల్వురేక మనస్సుతో
పరుల గృహము గుట్టు బైటఁబడదు
గోచరింపఁ గలదె గుప్పెట వస్తువు ॥విశ్వ॥

లోకమెల్లఁ దానె లోఁగొనవలెనన్న
ఆశతో మెలంగు నట్టివాఁడె
తన్నుఁ గొడుకు మించఁ దండ్రి కోరుచునుండు ॥విశ్వ॥

కం॥ పరులను బాధల పెట్టక
పరులను దనవలెనె చూచువాఁడె సుమతియగా
పరహితమె తనకు హితమగు
పరమత సహనంబు ధర్మపథమగు వేమా

కం॥ మగవాని చేతి బిడ్డలు
మగువ కరంబున్న ధనము మనఁజాలకయా
జగమున స్త్రీల సుఖంబులు
పొగనీడలవోలె క్షణిక భోగములు కవీ!

హారుఁడుమేన నిల్పె హరి వక్షమున నుంచె
బ్రహ్మ వాక్కునందె పరగఁ జేసె
ఆలిమీఁద ప్రేమ అందఱి కుండురా ॥విశ్వ॥

గీ॥ కుజనుఁడు కుతర్కమును జేయు, సుజనుఁడెపుడు
సౌమనస్యముతో సత్యసార మెఱుఁగు
బంభరము పూవుఁదేనెకుఁ బరుగులిడఁగ
పేడపుర్వు సదా పోవుఁ బేడకొఱకు.

కం॥ గురువుల సేవింపందగు
గురువులు వచియించినట్లు గుఱి నిల్పఁదగున్
గురువుల దీవన పొందుము
గురుజన ధిక్కారమెంత కూడని దన్నా !

కం॥ పోరాని యిండ్లకేగిన
ధారాని నికృష్టనింద రావచ్చు సతుల్
గారవము చెడని రీతిని
నేరుపుతో మెలఁగుటెంతొ నీతిర వేమా !

శౌర్యశాలి పరుల శౌర్యచిహ్నంబెంత
లెక్కసేయుటెంతొ ధిక్కరించు
కాఱుమేఘముఱుమ గర్జించు సింహము ॥విశ్వ॥

వస్తువెట్టిదైనఁ బనికివచ్చును ధీరు
ప్రతిభవలన మింట రథము రవికి
ఒక్క చక్రమున్న నుపయోగపడలేదె ॥విశ్వ॥

పరుగువారి మంచి పాలు త్రాగుటకంటె
నీరు త్రాగిగ్రైన నిల్కడొవ్వు
తగిన నడక గెలిచెఁ దాఁబేలు కుందేటి ॥విశ్వ॥

తిన్నకుక్క తిండితిని పోయినంతన
కన్నకుక్కఁ బట్టి కట్టినట్లు
ఎదురుపడ్డవాని కేర్పడు చిక్కులు ॥విశ్వ॥

గండిపడిన నదులు గ్రామాలఁ జెఱచును
చెఱచు కాపురములఁ జెడిన యువతి
దిటవులేని మంత్రి దేశమే చెఱచురా ॥విశ్వ॥

తోలుబొమ్మలాటఁ బోలు సృష్టి విధంబు
బొమ్మవచ్చి యాడి బొమ్మపోవు
హరున కెఱుక లేక ఆకులల్లాడవు ॥విశ్వ॥

నష్టమైనఁ గాని కష్టమైనను గాని
మాటకొఱకు నిలిచి మనుట లెస్స
వచ్చినట్టి వాడు చచ్చినఁ బోదురా ॥విశ్వ॥

గిల్లి జగడమాడు నిల్లాలి యింటిలో
కల్లగాదు సుఖము గలుగఁ బోదు
చెడ్డకంపు పొదలఁ జీదర పుట్టదా ॥విశ్వ॥

నవ్యభావకలిత నానార్థయుతపూర్ణుచుఁ
బరగునట్టి చిన్న వాక్యమెంట
తొట్టిలోన క్షీర తోయధి నింపుట ॥విశ్వ॥

గీ॥ చీడపురుగుల నన్నింటి చిదిమివైచి
యెరువు వేయుట తగుమొక్క పెరుగుటకయి
అట్టులే చెడ్డగుణముల నణచి ముందు
పిదప సద్గుణ సంతతి పెంచుమన్న !

పరిసరంబుఁ బట్టి పనిపాట లలవాట్లు
పెక్కు గలుగుచుండు చక్క మిడుత
యెట్టిగడ్డినున్న నట్టి రూపము దాల్చు ॥విశ్వ॥

కఱవు బిడ్డ వానకాలమ్ములో గొడ్డు
సతికి వీలుకాని సమయమందు
నలిథిరాక చాల యగచాట్ల బేరము ॥విశ్వ॥

గుఱ్ఱమునకు నులవగుగ్గిళ్ళు జీర్ణము
సరగ జీర్ణమగును గరికి వెలఁగ
ఉగ్గుఁబాలు జీర్ణ ముయ్యాల బిడ్డకు ॥విశ్వ॥

పరుని భావమెల్ల పరికింపకే ముందు
తూలనాడుటంత మేలుగాదు
తరచి తరచి జనుల తత్త్వమ్ము తెలియును ॥విశ్వ॥

కం॥ హాటకగర్భుని దనలో
సూటిగఁ గని నిత్యసత్యశుభమందిన వాఁ
డేటికి నితరము గోరుం
గోటికిఁ బడగెత్తి ముష్టికొఱకుం జనునే? ॥విశ్వ॥

బ్రహ్మపదవి దొఱక బాహ్యమెవ్వడు గోరు ?
పాల ఱాతి గోడఁ బగులఁ గొట్టి
మట్టిగోడఁ గట్టు మానిసి యుండునా ? ॥విశ్వ॥

రసములన్ని చిల్క రమణీయముగ గుల్క
తేఁట తేనెలొల్క తెలుఁగుపల్క
దేశభాషలందు దెలుఁగు లెస్సనిరయా ॥విశ్వ॥

ప్రాఁతపడినయట్టి పంచాంగములు పోవ
చుక్క లెటకుఁ బోవు దిక్కు వదలి
తనువు మాయ స్థిమిత ధర్మముల్ మాయునా ॥విశ్వ॥

వక్క లాకులుండి యొక్కింత సున్నంబు
లేకయున్న పండ లేదు విడెము
తగిన ప్రేమలేని దాంపత్య-మంతేరా ॥విశ్వ॥

ధ్రువుఁడు తపసు చేసి ధ్రువమండలము బొందె
కడపె దండధరు మృకండుకొడుకు
తపము వలనఁ జేయఁదగని దేదియు లేదు ॥విశ్వ॥

మంత్రివర్గమునకు మంత్రోపదేశమ్ము
సేయు జ్ఞాని యేమిసెప్పెనన్న
ప్రజల మేలుకొఱకె పనిచేయుమని పల్కు ॥విశ్వ॥

పనియు పాటలేక మనసును దేహము
నురక యుంచెదేని దురితమనక
చెడ్డ కృత్యములకు శీఘ్రముగా లోఁగు ॥విశ్వ॥

కుక్కదాలిగుంటఁ గూర్చుండి చోరత్వ
మబ్బె కూడదన్నయట్లు; కుమతి
విన్నయంతసేపు విజ్ఞుఁడుగా నుండు ॥విశ్వ॥

ఉల్లిసేయు పనిని తల్లియుం జేయదు
వేఁప చేదుక్రిముల రూపుమాపు
దేనఁబుట్టు పురుగు దానసే హతమగు ॥విశ్వ॥

ఇల్లుచూచి పిదప నిల్లాలి చూడుము
గుణములరసి చెలిమి కూర్చుకొనుము
తల్లిగుణము జూచి పిల్లను దీసికో ॥విశ్వ॥

తెచ్చిచచ్చినాఁడు చచ్చి తెచ్చినవాఁడు
ముచ్చటాడుకొనిరి మురిసి దివిని
దార్లు వేఱయైన ధర్మమొక్కటె గదా విశ్వ॥

ఎంతనీరుపోసి యెరువెట్లు వేసిన
దాలనున్న ఆకు రాలిపోవు
ఔషధంబు లీయ ఆయువు కలుగునా? ॥విశ్వ॥

కన్య కోరుచుండు కడు రమ్యమగు రూపు
ధనము గల్గువాని తల్లిగోరు
యశముఁ గూర్చువాని నాశించు జనకుండు ॥విశ్వ॥

పరునిమాట నమ్మి భార్యకు బిడ్డకు
చెఱుపు చేయఁ దలంచు చెనఁటి యెవఁడు
ఎలుకకొఱకు నింటి కెవఁడు చిచ్చును బెట్టు ॥విశ్వ॥

తల్లికున్న ప్రేమ పిల్లల కుండదు
ధరణివోలె నన్ని తల్లియోర్చు
తల్లిమనసు వెన్న పిల్ల' మనసు ఱాయి ॥విశ్వ॥

చెంతఁజేరువారు చెప్పెడి మాటలే
సత్యమనుచు పనులు సలుపు నృపతి
ఎత్తువారిచేతి పొత్తుల బిడ్డఁడు ॥విశ్వ॥

పండ్లచెట్ల దోటి పడవేసి కోతుకు
పెట్టువాని బాధ పెట్టుచుందు?
పాలొసంగు గోవు బంధబాధలు పడు ॥విశ్వ॥

చదివి సద్గుణముల సాధించు ధీరుల
విలువ పరమమూర్ఖు తెలియలేఁడు
గంధపుఁబొడి తావి గాడిదేమెఱుఁగును ? ॥విశ్వ॥

కోర్కెలూరసికొన్న కోలాహలము పుట్టు
గాలిసుతులు తిఱుగ కడలి యడలు
గర్వమడరచెడ్డ గగ్గోలు హెచ్చురా ॥విశ్వ॥

దోషరహితు మీఁద దోషమారోపించి
పరిహసింపఁ బోయి పతితుఁ డగుట
కవిసి తన్నఁబోవ కాలు జారినయట్లు ॥విశ్వ॥

పట్టుకొన్నదెల్ల బంగారమగుచుండు
కలిసివచ్చునట్టి కాలమందు
ఆడఁబోవు తీర్థమది యెదురైనట్లు ॥విశ్వ॥

'లంచగొండి' ధనము లాగుటకై లేని
తప్పుచెప్పి చేయి తాన చాచు
వ్రేలు వంకబెట్ట వెన్నపూస లభించు ॥విశ్వ॥

తిండిలేని ప్రజకు స్థిమిత మెట్లుండును
కడుపుఁ జిచ్చు తమ్ముఁ గాల్చునపుడు
కాలుగాల పిల్లి కదలక నిల్చునా ॥విశ్వ॥

గుణవిహీను లోటు కోవిదుల్ గమనించి
త్రిప్పుచుంద్రు మంచి విప్పిచెప్పి
చెడిన అంగమునకె చేయుదురు చికిత్స ॥విశ్వ॥

ముందె బెదరకుండ మూఁడడుగులడిగి
గుజ్జురూపి జయము గుంజుకొనియె
పొట్టివాని కుండు పుట్టెడు బుద్ధులు ॥విశ్వ॥

వింత యుక్తులన్ని వేశ్యమాత కెవండు
బోధసేయవలయు బాధయనక
తాత కెవ్వఁడైన దగ్గులు నేర్పునా ? ॥విశ్వ॥

గ్రీష్మఋతువునందు గ్రిందికేగిన నీరు
వర్ష కాలమందు వచ్చు పైకి
అండచిక్క నరుఁడు కొండెక్కి నిక్కఁడా ॥విశ్వ॥

కయ్యమెప్పుడు గోరు గయ్యాళిగంపయా
నాతినాతె ? చుప్పనాతిగాని
అట్టిదాని చెల్మి అగ్గిమండెడు కొల్మి ॥విశ్వ॥

మంచిమాటలెల్ల మహిత మర్యాదకే
కోటివిద్యలెల్ల కూటికొఱకె
సుతులు కలుగుటెల్ల గతులు చేకుఱుటకె ॥విశ్వ॥

విరహబాధచేత కరఁగెడివారికి
విధుని కిరణతతియు వేడియగును
పైత్యరోగి నోటఁ బంచదారయుఁ జేదె ॥విశ్వ॥

నాల్కలేని గంట నాదమ్ము నీయదు
సుదతిలేని యింట సుఖము లేదు
తావిలేని పూవుఁ దాల్ప నిష్టము కాదు ॥విశ్వ॥

కలుపుగోలుతనము కళలేను రతనము
ఖేదమొసఁగు రద్ది భేదబుద్ధి
దీక్షగలుగ నయము రక్షించు ననయము ॥విశ్వ॥

పుట్టెఁ డామరసమున మునిఁగి బూడిదఁ బొర్లు
అంటవలసినంతె అంటుకొనును
ఆర్జనమ్ముదృష్ట మనుసరించియె యుండు ॥విశ్వ॥

ఇహపరమ్ములందు బహుసుఖములఁ బొందు
భోగి యొకఁడు పరమయోగి యొకఁడు
చెప్పఁదగినయట్టి శ్రీగలవారురా ॥విశ్వ॥

పంది యీనుచుండు పదిపిల్లలను గూడ
ఏనుఁ గొక్కదాని నీనుచుండు
ఉద్ధరించు కొమరుఁ డొక్కఁడు చాలఁడా ॥విశ్వ॥

కల్లగాదు చిన్నపిల్లల హృదయంబు
కపట శూన్యమగుచుఁ గ్రాలుచుండు
ముకురకి యంటనట్టి ముకురంబు రీతిరా ॥విశ్వ॥

పెదవిమీఁద నవ్వు హృదయాన విసమును
కలిగి కపటి పైకి కానఁబడఁడు
నోరు మాటలాడ నొసలు హేళనసేయు ॥విశ్వ॥

ఆశ్రయంబు లేక అభివృద్ధి శూన్యంబు
పండితులకు, లతకు వనితలకును
మెట్లు దొఱకకున్న మేడెట్టు లెక్కనౌ ॥విశ్వ॥

పవనమందు నున్న ప్రాణవాయువు, తేమ
తగులఁ దుప్పుపట్టి తఱుగు నినుము
నరులు వలపుగాలిఁ గరఁగుచుందురు మెల్ల ॥విశ్వ॥

అస్థిపంజరమున ఆకార మేర్పడు
గుండెయాడు చాఱుచుండ నల్ల
ఉసురు లుండువఱకు ఉచ్ఛ్వాస నిశ్వాస ॥విశ్వ॥

ఎన్ని తగవులున్న నెఱిఁగి చివఱకెట్లొ
ఎవనివైపు వాఁడె యేగుఁ బుడమి
మెలిక తిరిగి కడకు చిలువ బొక్కం జేరు ॥విశ్వ॥

ఆదిశక్తియైన హైమవతిని బట్టి
అల జలంధరుండు పలుకు కెన్న
మిడుత యింగలమును మ్రింగఁ జూచిన రీతి ॥విశ్వ॥

ఎఱిఁగి పిన్నపెద్ద లేరీతి వర్తింపఁ
దగునో యట్టులుంట ధార్మికమ్ము
తెగువ చేసెనేని తెడ్డె లింగముగదా ॥విశ్వ॥

పరసుఖమ్ము గోరి పరితపించెడి వేళ
పరమహంస వచ్చి గురువగుటయె
పేదవాని కోర్కె పెన్నిధి దొఱకుట ॥విశ్వ॥

తనయు గుణము దిద్ద తండ్రికే లేనిచో
ఒరుని మనసు బాధ నొందనేల ?
కందకుండని జిల కత్తిపీటకదేల ? విశ్వ॥

పాఠ్య పుస్తకముల పరిశీలనము చేసి
మంచి కెపుడు స్థాన ముంచవలయు
తొలఁగిపోవ తాలు తూర్పార పట్టరా ॥విశ్వ॥

చాటుమాటులందు చాడీలు చెప్పెడి
చవట మాటలెవరు సమ్మతింత్రు
ఎఱిఁగి తప్పులున్న ఎదుటనే యనవలె విశ్వ॥

పట్టువిడుపు లేక పనులు సాగవుకొన్ని
పట్టుపట్టి సేయవలయుఁగొన్ని
కార్యసాధనగతి గమనించి నడువుము ||విశ్వ||

ఎన్నిగుణములున్న ఎక్కిరాదొక్కటి
కడు దరిద్రబాధ పడెడువేళ
వఱలఁగలదె నత్తి వారి వాక్చతురత ||విశ్వ||

తాను జెడినమాత్ర ధర్మమ్ము చెడఁబోదు
అడ్డదారి ప్రాణగొడ్డమగును
ఆపదలకు మూల మజ్ఞానమే గదా ||విశ్వ||

కట్టు విఱుగకుండ జెట్టియుఁ జాకుండ
ఒప్పుతప్పు లెట్లు చెప్పఁగలవు
ధర్మమున్నవైపు ధైర్యముతోఁ బల్కు ||విశ్వ||

మామయొక్కవైపు మగఁడొక్కవైపును
అత్తయొక్కవైపు మొత్తుచుండ
ఎట్టి కోడలైన నేరీతి నోర్చురా ||విశ్వ||

కల్లగాదు పరుల కాంక్షలు దీర్తురు
ధీరవరులు తమ్ము కోరకున్న
మేఘుఁ డెవరు బిల్వ మేదిని వర్షించు ||విశ్వ||

ధర్మనిరతిఁ బూని నిర్మలమతితోడ
దైవశక్తినమ్మఁ దప్పకదియె
కంటితెప్పవోలెఁ గాపాడదా నిన్ను ॥విశ్వ॥

గొప్పవానిఁ జూచి కొంచెపు నరులెట్లొ
వాగుచుందు) వావి వరుసలేక ॥విశ్వ॥
కుంజరమును జూచి కుక్కలు మొఱుగవా

పరమమూర్ఖు చెంతఁ బరమాత్మఁగను యోగ
ఘనత యిట్టిదనుచు కనఁబరచుట
అంధునెదుట పెద్ద యద్దము చూపుట ॥విశ్వ॥

కాలమునకు లొంగి కనుగల్గి మెలఁగుట
బాగు; శీతువేళ భాస్కరుండె
చలికి బాధపడుచు చయ్యన నేగురా ॥విశ్వ॥

వరుసఁ దిన్నయింటి వాసాలు లెక్కించు
వారు కొందరుందు) వసుధయందు
సొమ్ము తిన్నవాఁడె ఆొమ్ము గుద్దినయట్లు ॥విశ్వ॥

అడిగినంత యిచ్చు యజమాని యింటిలో
దొంగతనము సేయ దొరకొనుటది
పిదుకుకొనుట మాని పొదుగు కోసినయట్లు ॥విశ్వ॥

పెద్దవారుగాని పిన్నవారలుగాని
హద్దుమీఱటే యాడ హాని గలుగు
కట్టులేని నోరు గట్టుతెగిన యేరు ॥విశ్వ॥

కష్టసమయమందె కష్టముల్ గలుగును
సుఖములందె గొప్ప సుఖము లబ్బు
ఎండకాలమందె మందుగాల్పులు వీచు ॥విశ్వ॥

గొప్పవాని ప్రక్క కొంచెపు నరులున్న
లెక్క కెక్కకుంట అక్కజంబె?
సూర్యుడున్న దిక్కు చుక్కలు తోఁచునా? ॥విశ్వ॥

సొమ్ములగును తీఁగ కమ్మిచ్చునం బడి
ఒదుగు శిశు బిడ్డ ఒప్పులరసి
చిక్కుఁదీయ కురులు చక్కగా జడగొప్పు ॥విశ్వ॥

మంచిమాటలు విని మన్నింపఁ డెంతయు
దుష్టబుద్ధిలోంగు దుష్టచేష్ట
వజ్రమరసి కోయవలె వజ్రమున నెప్డు ॥విశ్వ॥

దూరవస్తువెఱుఁగ దుర్భిణీ యంత్రమ్ము
ఆత్మరూపము గన అచలయోగ
మఖిల జనుల మంచి కడకువ చాలురా ॥విశ్వ॥

లోతు తెలిసికొనక లోకులు మాటాడ
నిందసేయఁ బోకు నివ్వెఱపడి
నిజము తెలియఁగలరు నిలుకడ యున్నచో ॥విశ్వ॥

ఉక్కు తునుకలనఁగ నుగ్రరణంబుల
సిక్కులరుల నురుము సేయఁ గలరు
సిక్కులనఁగ వీరసింహములనఁ జెల్లు ॥విశ్వ॥

తనకు నీయఁబోవ తాఁ దిననొల్లక
అదియె పరుని చేతి దడిగి కొనుట
రొట్టెఁ బెట్టఁ దినక ఱోలునాకిన యట్లు ॥విశ్వ॥

రాజపుత్రునింట తేజోవిహీనుండు
పుట్టఁబోఁడు భీతి గిట్టఁబోఁడు
పులికి మేఁకపిల్ల పుట్టునా యెప్పుడైన ॥విశ్వ॥

తిండిలేక చాల తిప్పలు పడువేళ
కర్మ రోగియగుట, కఱవులోన
అధిక మాసమొకటి అరుదెంచి నట్టులు ॥విశ్వ॥

కలుములన్ని తనకుఁ గలిసివచ్చుచునున్న
విబుధుఁడెపుడు ఱొమ్ము విఱువఁబోఁడు
ఏర్లుచేర బొంగిపొర్లునా వారిధి ? ॥విశ్వ॥

తొంటిబాధ యింటి కొంటికొయ్యలబాధ
పంటిబాధ పిప్పిపంటిబాధ
చంటిబాధ తోడ సమములు గావురా ॥విశ్వ॥

స్వనములందు పికము స్వానము శ్రావ్యము
కళలయందు లలితకళలు మెఱుఁగు
జగతి ప్రాణులందు మగజాతి అందము ॥విశ్వ॥

ఓడవర్తకమున నోదవిన నష్టంబు
వడ్లదంపకమునఁ బాయఁ గలదె
జలధిలోని నీరు చలిమంట కింకునా ॥విశ్వ॥

కొద్దినోము నోఁచి గొప్పఫలము గోరఁ
గలుగఁ బోదు కర్మ తొలఁగఁ బోదు
పిండికొలఁది రొట్టె తిండికొలఁది కండ ॥విశ్వ॥

ఆదరించి వృత్తి కవకాశ మిప్పించి
నట్టివాని కొక్క హానిసేత
అన్న మిడిన యింటఁ గన్నంబు వేయుట ॥విశ్వ॥

దురభిమానమునకుఁ గరములోఁ బడిపోయి
తాఱుమాఱుపడుచుఁ దగవుతప్పి
తనదు మనసు మాఱ ధర్మంబు మాఱునా ॥విశ్వ॥

ఒకనితప్పు నైతఁ బ్రకటత్వమైన, నే
తొకని తప్పు లోన నొదిగియుండు
వార్ధినున్న మిట్టపల్లంబు లట్టుల ॥విశ్వ॥

వార్ధిపోటు హెచ్చు బడబాగ్ని రేగిన
కోపమొదవఁ దనువు కొంత పొంగు
వేడిచేయ నుబుకవే లోహపుంగుండ్లు ॥విశ్వ॥

ఐనవారికింత ఆకులో వడ్డించి
కానివారికిడును కంచమంచు
ఎట్టిమనుజుఁ డేమి యెఱుఁగురా ధర్మంబు ॥విశ్వ॥

వ్రాయవ్రాయ గొప్ప వ్రాయసకాఁడౌను
చేయఁజేయ నొడలి చేవ హెచ్చు
తఱచఁదఱచ దివ్యతత్త్వార్థవిదుఁడౌను ॥విశ్వ॥

కామతృష్ణ తగిలి కలఁచె దేనిమనస్సు
రెచ్చగొట్టు నిన్ను రేపుమాపు
జిలకు గోకుకొలఁది జిలబొబ్బ రేగదా ॥విశ్వ॥

ఎవ్వఁ డెంత పొంద నీశ్వరు దయవలె
పాంచభౌతికరమ పలుచఁబడదు
నీరు చేఁప త్రాగ నీరధి తఱుగునా ॥విశ్వ॥

అంషలేనివాఁడె అణఁగారిపోవును
అంషయుండె నేని కొండపాఁకు
విష్ణువుంటఁగాదె విజయుఁడు జయమొందె ॥విశ్వ॥

ఉల్లిపొరలమొత్త మూడదీసినయంత
బివలికొద్ది చేతఁ జిక్కునట్లు
ఆశలన్ని యుడుగ నవ్వల మోక్షమే ॥విశ్వ॥

కిరణజన్యసంయోగంబు జరుగునపుడ
ఆమ్లజని యాకువిడి మాయమైనయట్లు
కుండలిని జిక్కఁబట్టుట కుదిరెనేని
మాయకోరికలన్నియు మాయమగును

తాఁగుబోతు నోటఁ దాఁబుమాటను మాట
జ్ఞానినోట నిలిచి పూనికఁగను
వ్యక్తి గౌరవంబు వ్యక్తమౌ మాటలో ॥విశ్వ॥

ఉండి తినుటకు వీలులేకున్న యెడల
నేమి లాభము సరుకు నెంతయుండి
తినినదానిని జీర్ణించుకొనినవాఁడె
అనఘుఁడని చెప్పుటకు సంశయంబె వేమా !

పెక్కు మంత్రిసాను లొక్కెడఁ జేరిన
పెద్దపాణికెంతొ పెద్దచిక్కు
ఫలమొసంగుటరుదు బహు నాయకత్వంబు ॥విశ్వ॥

నరునిజూచి పాము నరుఁడు పామునుజూచి
ప్రాణభయముతోడఁ బరగు భంగి
పుణ్యపాపములకుఁ బొసఁగును వైరమ్ము ॥విశ్వ॥

"కోడుకోడు" అన్న కొండిముడిచి యాఁగు
తేలుకేమి తెలియుఁ దెలుఁగుబాస
భయముచేతఁగాని భక్తిచేఁ గాదురా ॥విశ్వ॥

పరులసొమ్ము మనకుఁ బ్రాప్తింపవలెనను
ఆశయుండఁదగదు లేశమైన
కాసువీసమైన కష్టార్జితము మేలు ॥విశ్వ॥

అతి సమర్థుఁడైన యవనీశుఁడుండఁడేఁ
గువలయంబు వంచకులకుఁ దక్కు
అడరి నక్కలేలు హరిలేని యడవిని ॥విశ్వ॥

జీవనమ్ము నిచ్చు జీమూతమే పిడుగు
రాల్చి యొక్కచెట్టుఁ గాల్చివేయు
కానివేళ హితుఁడె కడకుఁ గీడొనరించు ॥విశ్వ॥

తనదు బూజుతాట్రఁ దాఁ జిక్కి వ్రేలాడు
సాలెపురుగు భంగి సంచితమున
జీవులన్ని జిక్కి జీవయాత్ర నటించు ॥విశ్వ॥

ఆఋవంతులు మనకృషి నాచరించి
వదలవలయును సేడవవంతు విధికి
కష్టపడుటకె చేతులఁ గాళ్ళ బుద్ధి
నిచ్చె భగవంతుఁ డని మది మెచ్చవలయు

నీవు సేయు పనుల నీ యదృష్టదశమ్ము
తోడుపడక ఫలము కూడదెపుడు
వట్టిచేతఁ బిండఁ బసరెల్లు వచ్చురా ॥విశ్వ॥

క్రొత్తగుడ్డ తడిని కొంచెముగాఁ బీల్చు
ప్రాఁతగుడ్డ పీల్చు బాగుగ తడి
ననుభవమున శక్తి యధికమౌట నిజంబు ॥విశ్వ॥

సుందరాంగి తన్నుఁ జూచి మోహించిన
శుకుఁడొకండు భీష్ముఁడొకఁడు తప్ప
నిప్పువంటివాఁడు నీరయిపోవఁడా ॥విశ్వ॥

చాలకాలముండుఁ జందనపుం గొయ్య
ఇనుము గట్టిదైన మనదుమట్టి
పాత్రమెఱిఁగియీవి క్షేత్రమెఱిఁగి విత్తు ॥విశ్వ॥

తెలిసి కలియరాదు కలిసి తెలియరాదు
తెలిసి కలిసి యెదలు కలఁచరాదు
విశ్వగమనమెల్ల విధివిచిత్రముగదా ॥విశ్వ॥

నరులకేమి దేవ వరులకైనను గష్ట
సుఖములుంట మనము చూడఁగలము
ఈశుశిరము శశికి హెచ్చుతగ్గులు లేవె ! ॥విశ్వ॥

నిత్యసాధనమున నిపుణత హెచ్చును
నూరకున్న మొద్దు పారుచుండు
ప్రతిదినమ్ము నూఱఁ బదనెచ్చుఁ గత్తికి ॥విశ్వ॥

కల్లొసంగు సుఖము కలకాలముండదు
అమృతసుఖము నిల్చు ననవరతము
ఐహికంబు విచలమాధ్యాత్మ మచలము ॥విశ్వ॥

ఆశలన్ని యుడిగి అచలపూర్ణానంద
మందె నిలిచి నైష్క్యమైనవాఁడు
మోక్షమందుఁ గాని పుట్టఁడు గిట్టఁడు ॥విశ్వ॥

వాయుకుండమెచట వారిధిఁ బుట్టునో
అచట గాలివాన యతిశయించు
తోఁకచుక్క పుట్టఁ దోఁపవా యాపదల్ ॥విశ్వ॥

ఆత్మశక్తియున్న యధికారి యాజ్ఞను
వేగ ననుసరింతురు వేయిమంది
ఒక్క బెట్టు నొక్క పెక్కు దివ్వెలు వెల్గు ॥విశ్వ॥

పోసఁగ వానవేళ పూఁదోట మొలచిన
మొక్కలన్ని పూలమొక్కలౌనె ?
ఒక్క వంశ్యు లందఱొకరీతి నుందురా ॥విశ్వ॥

పానమన్న నొకఁడు గానమన్న నొకండు
చిత్రమన్న నొకఁడు చిత్తమిచ్చు
జిహ్వకొక్క రుచియు శిరమున కొకబుద్ధి ॥విశ్వ॥

చెట్టు గొట్టుపిట్ట చెట్టుతొఱ్ఱగఁ జేసి
అందు దాఁగు పురుగులన్ని తినును
పిట్ట యెంత దాని పట్టుదలెంతరా ॥విశ్వ॥

ప్రకృతియందుఁ బుట్టు పరమాణువునకైన
దేని సహజగుణము దానికుండు
పికము శుకము గాదు శుకము పికము గాదు ॥విశ్వ॥

మంచిచెట్టలెన్న మతిలేని భూజమే
నిత్య మెండనుండి నీడ నిచ్చుఁ
బరున కంతకంటె బరమార్థ మున్నదా ॥విశ్వ॥

నేల యునికిఁ బట్టి నీటి వసతిఁ బట్టి
సీతువేఁడి వాన స్థితులఁ బట్టి
పరిసరమును బట్టి పెరుగును వృక్షముల్ ॥విశ్వ॥

ఎచట బ్రదుకఁ దెఱువు లేర్పడియుండునో
యచట కేగుచుండు రఖిల జనులు
సూర్యరశ్మి వైపుఁ జొఱఁబడు మొక్కలు ॥విశ్వ॥

పండ్లదారినైన ముండ్లదారినైన
పాదరక్షలున్న భయము సున్న
కలుగు సుఖము శాంతిఁ గలిమిలేముల బంతి ॥వి॥శ్వ॥

వర్ణనాత్మకముగ వాకొను పండితు
లినుని కిరణవితతి నిమిడియున్న
సప్తవర్ణములనె సప్తాశ్వము లనిరి ॥విశ్వ॥

వెఱవు తెఱువు లేని వెఱ్ఱి దద్దమ్మలు
కూడినట్టి కొంప కూలిపోవు
కంబములు లొలంగఁ గప్పెట్లు నిలుచురా ॥విశ్వ॥

చింతలేనివాఁడు శ్రీహరి తుల్యుఁడు
భ్రాంతిలేనివాఁడు బ్రహ్మ నిభుఁడు
భయములేనివాఁడు పశుపతి సముఁడురా ॥విశ్వ॥

ధర్మసూక్ష్మమరయఁ దఱముగా దెల్లఱ
కందుకొనఁగఁ బ్రజ్ఞ యవసరమ్ము
ప్రజ్ఞలేనివాఁడు సుజ్ఞాని కాలేఁడు ॥విశ్వ॥

ఎగ్గుసిగ్గు లేని హీను రానిచ్చిన
పీటకిరింది మట్టి పిరిదిలఁ జేయు
ఘోణి యెచటనైనఁ గుద్దలింపఁడె నేల ॥విశ్వ॥

ప్రజ్ఞా ధురంధరుండగు
సుజ్ఞానికి నెచటనైన చోటుండునురా
జిజ్ఞాసువిది తలఁచి బ్ర
హ్మజ్ఞాన సమాధి నంది నలరును వేమా !

వదరుఁబోతు తోఁడ వాగ్మికిఁ బొత్తేడ
సానితోడఁ జెలిమి సాధ్వికేడ
మూర్ఖుతోడఁ బొందు మోక్షార్థికేడరా ॥విశ్వ॥

అంతరాత్మ తెలుపునట్టిది గట్టిది
యోగికైన పరమ భోగికైన
దాని బోధవిన్న ధన్యుఁడ వగుదన్న ॥విశ్వ॥

వైరకారణమ్ము వాదియుఁ బ్రతివాది
వాక్కులరసి తీర్పు వాకొనఁదగు
పక్షపాతమొందుఁ బనికిరాదని విందు ॥విశ్వ॥

వావి వరుస లేక వాస్తవ మెంచక
తిట్టునట్టి నోటిఁ దిరుగుకాలి
నూరకుండుమనుట యురిశిక్ష వేయుట ॥విశ్వ॥

ఎట్టి సాహసమున నెసఁగు నరుం డైనఁ
దాను జచ్చుమందుఁ దాఁ దినందు
పౌరుషంబుఁ జూప బడబాగ్ని మ్రింగునా ॥విశ్వ॥

చేరుకొనెడివన్ని చెట్లులు చేమలు
గూడుకొనెడివన్ని గుండ్లునాగ
నెట్టివానిచెంత నట్టివాఁడె చేరు ॥విశ్వ॥

జోలిమాలిన పని జోక్యంబు కలిగించు
కొనుట యేరికైనఁ గూడదన్న
మేకుఁబీకి కోతి మృతినొందలేదొకో ॥విశ్వ॥

కం॥ విజ్ఞాన విలోకమునకుఁ
బ్రజ్ఞానమె బ్రహ్మమగుచు భాసిల్లంగా
సుజ్ఞానమె సూర్యోదయ
మజ్ఞానమె యంధకార మరయుఁగ వేమా !

ఎందఱెన్ని మాట లేరీతిఁ బల్కిన
బీరువెన్నఁడైన వీరుఁడగునె !
నాటుకుక్కఁ దఱుమ వేటాడఁ జాలునా ? ॥విశ్వ॥

పిల్లవానిమీఁదఁ బ్రేమ యెక్కువ చూప
నెఱిఁగి వాఁడు మీఁది కెక్కఁ దలఁచు
శిక్షణమునఁ గాని శీలమ్ము కుదురదు ॥విశ్వ॥

పఱ్ఱునేల లెన్ని గొఱ్ఱులు తనకున్న
అనుభవమున కింత యుందఁబోవు
మనసులేని మగఁడు మంచము నిండురా ॥విశ్వ॥

నవ్వు చేటుగూర్చుఁ నాలుగు విధములఁ
గోప మంతకంటె ఘోరతరము
శాంతమొండె సౌఖ్య సామ్రాజ్య సమ్రాట్టు ॥విశ్వ॥

పొట్టకూటి చదువు మిట్టిపడం జేయు
గట్టిచదువు మనసు దిట్టపఱచు
నిండుకుండ కదల కుండు టాశ్చర్యమా ॥విశ్వ॥

గ్రామసీమలందుఁ గాఁపులు కరణాలు
తప్పు లరసి తీర్పు చెప్పిరేని
పాడిపట్టుతోడఁ బని యేమి యున్నది ॥విశ్వ॥

వాయుకుండ మెచట వార్ధిఁ బుట్టిన నట
గాలివాన గొట్టు కల్లగాదు
ఎచట పాపమున్న నచట కష్టములుండు ॥విశ్వ॥

జీవహింస మాని జీవింప వీలైన
జీవహింస నేల చేయవలయు ?
భూతదయ యొకండు పుణ్యతమం బండ్రు ॥విశ్వ॥

దైవభక్తి కలిగి తన్మయత్వము పొంద
సాధనమ్ము గాగ సలిపెదేని
కళలు కలలు గావు కైవల్య పథములు ॥విశ్వ॥

జ్ఞాన శూన్యమైన జాతి కత్యున్నత్య
పదవి దొఱకదెంత పాటుపడిన
మణి తెఱంగు రాయి మకుటము నెక్కునా ॥విశ్వ॥

సింహముండు గుహను చెలఁగి ముత్యములుండు
నక్కబొక్క పీత తొర్రలుండు
గొప్పవారి బుద్ధి గొప్పయూహాలె యుండు ॥విశ్వ॥

చెడ్డచెలిమి చేసి శిశుపాలుఁ డుదుటున
హరిని దూరి ప్రాణహాని బొందె
పొంగుపొంగు బెల్ల పొయ్యి పాలగుటకే ॥విశ్వ॥

దొంగబ్రతుకు బ్రతుక దార సమ్మతింపఁడు
దారగుణములు దొంగ ఎఱుఁగలేఁడు
బూటకమున కెన్నో బాటలు కలవురా ॥విశ్వ॥

పోతుటీఁగయైనఁ బోరాని లంకకు
నాంజనేయుఁ డరిగె నబ్బురముగ
సహజశక్తి కొంత స్వామిభక్తి మరింత ॥విశ్వ॥

బోధచేసి యెన్ని బాధలు పెట్టిన
సహజ గుణము మారజాల దెపుడు
కుక్కతోఁక నెవఁడు చక్కఁజేయఁగ నేర్చు ॥విశ్వ॥

చదివి జీవితమున సద్గుణ జాలమ్ము
లమలు పరుపలేని యధము చదువు
కనులు లేనివాని కరదీపిక విధంబు ॥విశ్వ॥

తులువ కష్టసంగి పలుమారు లడిగిన
కయ్యమున కతండె కాలు త్రివ్వ
గంచెమీఁది గుడ్డఁ గనిపెట్టి తీయురా ॥విశ్వ॥

దేవ దానవులకుఁ దీఱని వైరంబు
కలుగఁ గారణంబు తెలియఁ గలమె ?
గుణము వేఱుగాని గురువొక్కఁడే గదా ॥విశ్వ॥

ఆత్మశుద్ధి కొఱకు నన్వేషణము వీడి
బాహ్యచిహ్నములకుఁ బ్రాకులాట
గట్టి విడిచి వట్టి పొట్టుకుఁ బోట్లాట ॥విశ్వ॥

భౌతికమునగాని పరమార్థమునగాని
బ్రహ్మచర్య మిచ్చుఁ బరమ సుఖము
సుఖము కోరెదేని చూడరా బ్రహ్మము ॥విశ్వ॥

ఆకుటింటి సుఖము హర్మ్యంబునకు లేదు
రాజెఱుంగఁడు మునిరాజు సుఖము
కష్టజీవి హాయి కలవాఁడు పొందునా ||విశ్వ||

పువ్వు నొవ్వకుండఁ పుష్పంధయంబింత
తేనె ద్రాగి హాయి తిరుగుచుండు
ఎఱుక గలఁడు పరుల హింసించి బ్రతుకఁడు ||విశ్వ||

న్యాయమార్గముననె నడవ దలంచెడి
వారిఁ గష్టపెట్టు వారు కలరు
ధర్మమునకు బలము తగినంత లేదురా ||విశ్వ||

ఎంతయున్నఁ దనకు నింత లేదనుకొంచు
కుందువాఁడు సుఖముఁ నొందలేఁడు
చింతలేనివాఁడె సిరిగలవాఁడురా ||విశ్వ||

గాలివానకైన రాలదు గిజిగాని
గూడు, తాటియాకు కొసన యున్న
పక్షి కెంత తెలివి పరమేశుఁ డొసఁగెరా ||విశ్వ||

సాధనంబు లెన్ని సమకూడినను తజ్ఞు
డుండని యెడల నుపయోగపడవు
తేఱు సరిగ చనునె సారథి లేకున్న ||విశ్వ||

ఇల్లు వెండికొండ విల్లు బంగరు కొండ
ఈశుఁ డేల బిచ్చ మెత్త వలసె
విధి విధానమునకు వేఱుగా జరుగునా ||విశ్వ||

ఒకఁడు చర్మమిచ్చె నొకఁడు మాంసంబిచ్చె
నొక్కఁ డస్థు లిచ్చె నొకఁడు ప్రాణ
మిడె, నుదారభావుఁ డీలేనిదున్నదా ||విశ్వ||

కలదు లేదని మదిఁ గలఁత చెందఁగరాదు
కలఁత చెంద గొప్ప ఘనత రాదు
లేమికంటె నొప్పు లేమి చిక్కులు పెక్కు ||విశ్వ||

కోడి కూయుచుండె 'కొక్కొరొకో' యని
కాలమెఱిఁగి యెవఁడు మేలుకొలిపె
ప్రకృతిరూపుఁడైన పరమేశు లీలరా ||విశ్వ||

బీదవాని యింట బిచ్చమెత్తఁగ వచ్చు
ధనమదాంధుఁ జేరఁ దగదు కవికి
చేరనేని వాఁడు ధీరుఁడు కాదురా ||విశ్వ||

గొడ్డు త్రాగుచున్న మడ్డి నీరైనను
పీకె యెండెనేని పీల్చు నరుఁడు
అవసరమ్మొకప్పు డాచార మెఱుఁగదు ||విశ్వ||

సంస్థగాని గొప్ప సంసారమే కాని
ముద్దు గొల్ప దొక్క పెద్దలేక
మేకుపూస లేని హారము రీతిగ ॥విశ్వ॥

పాలలోని కింత పంచదారయు లేక
కొంద అలవటింపఁ గొంద అచ్చు
గంజిలోని ఉప్పుగల్లు లే కేస్తురు ॥విశ్వ॥

భేదబుద్ధితోడ వాదము లాడుచో
మనసు కుటిల మెటుల మాసిపోవు ?
పృష్ఠ తాడనమున నెట్లు దంతము లూడు ॥విశ్వ॥

దైవబలము కలిగి తారాపథంబున
తెగురుచున్నవాని నెదురు కొనుట
చుక్క కెదురు నిండు చూలాలి పయనమ్ము ॥విశ్వ॥

లౌకికంబు లేని లేకికిఁ బ్రేమతో
బహు జనోపయోగ పదవి నిడుట
కోఁతికి జలతారు కుళ్ళాయఁ బెట్టుట ॥విశ్వ॥

ఏ గ్రహంబు గాని ఏకాదశ స్థాన
మందుఁ జేరెనేని హాయి నొసఁగు
తెల్లయినుక యూట తీపిగా నుండదా ॥విశ్వ॥

అర్థ కామములెటు లాత్మ విజ్ఞానంబు
బాహ్య సాధనముల వలను పడదు
మనసు పట్టి నిలుప మర యొక్కటున్నదా ||విశ్వ||

పట్టుపురుగు ప్రత్తిఁ బుట్టింప జాలదు
ప్రత్తి చెట్టొ కింత పట్టు నిడదు
సాధ్యమైన పనిని సాధింతు రెవరైన ||విశ్వ||

పండితుండె యైన వక్తృత్వ శూన్యుండు
పల్కలేఁడు సభను; నాల్కలేక
కంచుగంట యైన గణగణ మ్రోగునా ||విశ్వ||

అరసి గింజ లిన్నొ యన్నొ కేపటి కెత్తి
చీమయైన బారియఁ జేర్చుకొనును
మనుజుఁ డెట్లు భావి మనుగడ మఱచురా ||విశ్వ||

పరుల నిందసేయ పాపంబు కలుగును
తన్ను తాను పొగడుకొన్న నఘమె
రెండు లేనివాఁడు దండిమనుజుఁ డెన్న ||విశ్వ||

పిఱికి కండ యింత నెఱుఁగని యాంధ్రుల
కఱుకుఁ దనము నేల గలిసెనేల ?
కాలచక్ర మహిమ గమనింప శక్యమా ||విశ్వ||

ఉష్ణదేశవాస సౌఖ్యముఁ జనులక్కు
లందమైన వపువు లొదవఁగలుగు
ఉగ్రమూర్తులైన నిగ్రోల బాటవమా ||విశ్వ||

దేహ సౌఖ్య మరసి దినదినమున సౌఖ్యసాగ
సుష్టుఫలము తింప మొక్కపలయు
గట్టిగింజ తనువు దిట్టము సేయుదా ||విశ్వ||

పేనుకింత పెరిమ పెత్తన మిచ్చిన
హాని కలుగుఁ దలకు హాయి లేదు
ఖలుని పెద్దసేయఁ గలుగునా సౌఖ్యంబు ||విశ్వ||

శాంతశమదమాది సద్గుణంబులు గల్గ
సౌఖ్య మందగలరు సర్వజనులు
దాన స్వర్గసీమ యౌను భూలోకంబు ||విశ్వ||

గుణముచేత గాని కులముచే నెన్నఁడు
ఘనుఁడు కాఁడు మానధనుఁడు కాఁడు
ఏకలవ్యుఁ డెవ్వఁ డెఱుకవాఁడే కదా ||విశ్వ||

రంగుమాసి గొప్ప రాసాయనికగతి
వజ్ర మొంద దెంత పాటుపడిన
సిద్ధపురుషుల దృఢ చిత్తము మాఱదు ||విశ్వ||

విప్రవంచక కేళుల విన్నాణ ఖనియైన
కవిత పేరు పూర్ణ గడగ డౌర
ధనపుదాంఘుc దేల తనసి నేస్తము గోరు ॥విశ్వ॥

లోక సంగ్రహార్థ మే కవి వ్రాయునో
అతని దివ్య కవిత అమృత మొలుకు
స్వార్థపరుల రచన వ్యర్థమై తీరదా ॥విశ్వ॥

గోత్ర వృద్ధి గోరి పుత్ర వాత్సల్యమ్ము
వీడజాల రెట్టి వేడుకైన
ప్రాణమిచ్చెc గొడుకు బ్రతికింప బాబరు ॥విశ్వ॥

గంజి లేని యింటc గడుపెడు ప్రజ గల్గ
తల్లిదండ్రులు పరితాపపడరు
దిగిన కాయులెల్లు తీcగకు బరువౌను ॥విశ్వ॥

పతిని ధిక్కరించు పడతి చేష్టలు గన్న
ఏరికైన రోcతయే జనించు
పెదవి మించినట్టి రదము గాంచినరీతి ॥విశ్వ॥

ఒకనితప్పు లోకని కొప్పులుగాc దోcచు
ఒప్పులోకని వతcడౌ తప్పులనును
పక్షపాతబుద్ధి పాపాల సుద్దిరా ॥విశ్వ॥

గుణిగణమ్ము వొగడ గుణవంతునకుఁ జెల్లుఁ
బుండరీక గుణము పొసఁగ తెలియు
మానసౌకసంబు మాలకాకికిఁగునా ||విశ్వ||

నాస్తికుండె గాని ఆస్తికుఁడే గాని
ఒక్కశక్తి యుంట కొప్పుకొందుర్
ప్రకృతి యంచు వీరు పరమాత్మ యని వారు ||విశ్వ||

కానిమాటలాడి జానెడు పొట్టకై
పరుల మోసగించి బ్రదుకఁ జూడ
దినము గడచు గాని తనువెట్లు గడచురా ||విశ్వ||

ఓర్పు నేర్పులు గల యోచన లేకున్న
మానవునకు విన్నమాటకంటె
చేటు గూర్చుచుండుఁ జెప్పెడి మాటలు ||విశ్వ||

పైరు వాడిపోవు పడమటి గాలిచే
పైరగాలిచేత పైరు పెరుగు
దెసలు మారినంత పస యెంత మారెరా ||విశ్వ||

ఎన్ని భాషలైన ఎఱిగి యుండవలె సార
మాంధ్రమునకుఁ జేర్చు మంతెగాని
తల్లిబాస విడుట తన్ను దా మఱచుట ||విశ్వ||

అడిగికొనెడి వాని కరువది కూరలు
వండికొనెడి వారి కొండు కూర
సతికిఁ బ్రియుఁడొకండు సానికిఁ బలువురు. ॥విశ్వ॥

పెట్టినన్ని నాళ్ళు పెండ్లిని గోరుచు
పెట్టలేని వేళ తిట్టుచుండు
లోక తంత్రమునకు లోఁబడ బోకుము ॥విశ్వ॥

పండితునకు నైనఁ బామరునకు నైన
గుండె నిబ్బరంబు కూర్చు సుఖము
తత్తరమునఁ బనులు తారుమారగుచుండు ॥విశ్వ॥

మండనమున గాని ముండనమున గాని
మోద ఖేదములను పొందనట్టి
సాధుపుంగవుండు సర్వజ్ఞుఁ డొక్కఁడే ॥విశ్వ॥

చంక బిడ్డ కొఱకు చందమామను బిల్వ
దివిని విడిచి యెట్లు భువికి వచ్చు?
మాయమాటచే నమాయకులకుఁ దృప్తి ॥విశ్వ॥

సింగ మెన్ను తలను చీల్ప నేగును గాని
కడుపుఁ జిచ్చు గడ్డి కఱవఁ బోదు
సజ్జనుండు కష్ట సమయాన లొంగునా? ॥విశ్వ॥

విదురనీతి వినక వదరుచు కురురాజు
సర్వనాశకుఁడయి యుర్విఁ బడియె
చెప్పువారు లేక చెడిపోవ రెవ్వరు ॥విశ్వ॥

ఊరిమీఁద వేర ఊరు పడిన నౌక
కాసు పడగబోదు కరణముపయి
పరుఁ డాయు మిత్రి పరశివు డాయునా ॥విశ్వ॥

దొరతనమ్ము గలుగఁ దొత్తున కైనను
ప్రోల చేతులెత్తి మ్రొక్కవలయు
స్థాన మహిమగాని తన మహిమా యది ॥విశ్వ॥

సహజ దుష్టబుద్ధి సజ్జన సహవాస
మెంత కాలమున్న నేమి ఫలము
మల్లి ప్రక్క పెరుగ నుల్లి కంపెటు మాయు ॥విశ్వ॥

పక్షపాత బుద్ధి పాపాత్ములకె యుండు
సత్యనిష్ఠ యుండు సజ్జనులకు విశ్వ॥
భక్తిపరుల కుండుఁ బరమేశుపై దృష్టి

ఆత్మజాతు లెన్ని యగచాట్లు పెట్టిన
సహనభావమూని సంతసింత్రు
ఎవరికంపు వారి కింపుగా నుండదా! ॥విశ్వ॥

దేహి దుర్గుణములు దైహికమే గాని
ఆత్మ కెన్నఁడైన నంటఁ బోవు
ఏటికున్న వంక నీటికి నుండునా ||విశ్వ||

మాటలాడ నేర్వ మసలదు పోట్లాట
తినుట నేర్వ రోగ మణగి పోవు
తగిన కృషిని సల్ప దారిద్ర్య ముండదు ||విశ్వ||

చక్కెరపాడికంటె 'శాక్రీను' కడు తీపి
ఆలుకంటెను వెలయాలు తీపి
కలినిజంబు కంటె కల్లయే కడు తీపి ||విశ్వ||

నీతినిచయమెల్ల చేతలలో నున్న
ఘనత కలుగు ననుట కల్లగాదు
అమలమైన తిండి ఆరోగ్య మొసఁగదా ||విశ్వ||

బహు విధమ్ములైన పరివర్తనములచే
బొగ్గె వజ్రమైన పోల్కి, నరుఁడు
సద్గుణాల సరిగ సాధింప సాధువౌ ||విశ్వ||

విష్ణురూపుఁడైన కృష్ణునంతటి వాఁడె
బోయ బాణహతినిఁ బొందవలసె
వంతు వచ్చెనేని గంతు వేసినఁ బోదు ||విశ్వ||

ఎఱుక లేక నీవ ఏ తప్పు చేసిన
తెలిసి పరితపింపఁ గలితొలంగు
దాసు తప్పులన్ని దండముతో సరి ॥విశ్వ॥

దాత చెంత దాన ధర్మమ్ములం గల
శోభ చెఱచునట్టి లోభులుంట
పండ్లచెట్టు చుట్టు ముండ్లపొద గలట్లు ॥విశ్వ॥

ఆర్ద్ర హృదయమందు నవతరించెడి ప్రేమ
ఈశు గుణము గాన నేలు జగము
ప్రేమ మనఁగ వేఱు కామము వేఱురా ॥విశ్వ॥

ప్రాజ్ఞకోటి మధ్య బహుకాల ముండినన్
తెలియలేఁడు వారి తెలివి మూర్ఖు
తెడ్డు పాకగుణము తెలియఁగ జాలునా ॥విశ్వ॥

ధైర్య శౌర్య నిధియు దైవోపహతుఁడగు
సమయమందుఁ జిక్కుఁ జవటకైన
తేలు బూజుపడిన సాలీఁడు చంపదా ॥విశ్వ॥

చింత ముదురు కొలది చేవ హెచ్చుగ నుండు
వేశ్యమాత జిగుకు వేశ్యకంటె
మత్తు మిక్కుట మగు మద్యమ్ము పులిసిన ॥విశ్వ॥

మొక్కవాని నణఁగఁ ద్రొక్కెడి నీచులు
కలరు, లొంగినట్లు కనఁబడు నెడు
కుక్క కసరి యుఱచి నిక్కి మైఁబడఁజూచు ॥విశ్వ॥

ఉత్త మాధములకు నుండు భేదములెన్నొ
మనుజ ముఖమునందె మనకుఁ దెలియు
వాడలున్న యునికి గోడలు చెప్పవా? ॥విశ్వ॥

పాప పుణ్యములకు రూపు లేకున్నను
ఫల మొసంగుచుండుఁ దొలఁగకుండ
తెలియఁబడని యాత్మ త్రిజగము ద్రిప్పదా? ॥విశ్వ॥

ఒకరి జన్మసుకృత మొకరికి నొదవదు
గురువు మించు శిష్యవరులు కలరు
అగ్గిలుకంటెఁ బైకి నావిరి పోవదా? ॥విశ్వ॥

పలువనైన నమ్మి పని సేయవచ్చును
పలువకంటె సాధు పలువ తులువ
కప్పకూఁత పాము ముప్పొనగూర్చురా ॥విశ్వ॥

గొప్పవాఁడు పోవఁ గొలఁదివానికి గూడ
గొప్పవాని వెలుఁగు కొంత కలుగు
సూర్యుఁ డస్తమింప జ్యోతిర్లత వెలుంగు ॥విశ్వ॥

మాతృ కరుణతో సమానమైనది లేదు
కొడుకు బయటినుండి కొంపఁ జేర
తల్లి పొట్టఁ జూచు నిల్లాలు చేఁ జూచు ॥విశ్వ॥

పనికిమాలినట్టి పందకు నడుమనే
కలిమి కలిగినంత కనులు తిరిగి
అర్ధరాత్రియందు నడుగును గొడుగును ॥విశ్వ॥

ఘనుల బోధ, బుద్ధి కలుషమ్ము లడగించి
నిర్మలమ్ము సేయు, నీటి బురద
చిల్లగింజ సాద చేరదా యడుగున ॥విశ్వ॥

లోకవర్తనమ్ములో లీనమై యున్న
మంచి చెడ్డల విభజించు జ్ఞాని
పాలు నీరు వేరు పఱుప హంసకుఁ జెల్లు ॥విశ్వ॥

ఎట్టివారితోడ సేవని దొరకొన్న
కీ లెఱింగి సేయ మేలు కలుగు
గంత గట్ట నెద్దు గానుగఁ దిర్పదా! ॥విశ్వ॥

కాలవశము చేత ఘనునకుఁ బతనమ్ము
కలుగ, తొలఁగఁ జేయవలయు ఘనుఁడె
ఏనుఁ గెత్తు వడ్డ నేన్గె యెత్తవలయు ॥విశ్వ॥

కఠిన వర్తనమును ఖండింప వలెనన్న
కఠిన మార్గమునకుఁ గడఁగ వలయు
విసపు రోగమునకు విస మమృతంబౌను ॥విశ్వ॥

ఐకమత్యమొదవ నన్యోన్య సౌహార్ద
వర్తనంబు లేని వారి గృహము
కలిసిరాని యట్టి కప్పల తక్కెడ ॥విశ్వ॥

భోగలాలసునకు రోగ భయంబుండు
మోహనాంగి కుండు ముదిమి భయము
కర్మఠునకు క్రూర కర్ముల భయముండు ॥విశ్వ॥

చేతమెప్పనట్టి చేతకు భీష్ముండు
గురువుతోడ నైన గుద్దులాడెఁ
బరముఁ గోరి తండ్రిఁ బ్రహ్లాదుఁ డెదురఁడా! ॥విశ్వ॥

బంధముక్తి నొసఁగు పరమాత్మ శ్రీకృష్ణుఁ
గట్టఁ గౌరవుండు దిట్టపడుట
తన్ను గట్టఁ ద్రాళ్ళు తాఁ దెచ్చుకొనుటరా ॥విశ్వ॥

శకుని మైత్రి చేసి సహజశక్తిని బాసి
గడ్డుతోవఁ బడెను గౌరవుండు
మనులు తీవమెట్టఁ దెసవు తప్పి చరించు ॥విశ్వ॥

గోడ్డువాటు మూక గణము గ్రహింపదు
మంచివాని హితము నెంచఁబోదు
పుంజు కెంపుఁ గంది గింజ గాదని త్రోయు ॥విశ్వ॥

శాంతికాముఁడైన సమతత్వ బుద్ధితో
చెలిమి సేయదే నృసింహమైన
భక్తుఁ బ్రోచి వైరి వధియించె శ్రీహరి ॥విశ్వ॥

పరమ మైత్రియందు వైరమ్మునందును
సుజను మనసు చొరదు వృజినమునకు
సరస పదముఁ ద్రిప్పి చదివిన సరసమె ॥విశ్వ॥

ఎదురుకుతికలైన నెదుసుకాళ్ళఁ బుట్టె
నట్టివారు తోము టదియ మందు
ఉష్ణ ముష్ణముననె యొప్పు శీతలమూచు ॥విశ్వ॥

ఎదఁ జెలిమి నాఁడు నాటికిఁ
జెదరిన చెలి విడుటయెంతొ శ్రేయస్కరమా
కదలిన పిమ్మట రదమము
వదలుటయే మేలటంచు వాకొను వేమా!

పట్టుపట్టి విద్దె పగలెల్లఁ జదివిన
రేయి మిగుల నిదుర రాదు నేల
నిద్ర మానెదేని నీరసమెచ్చురా ॥విశ్వ॥

నిమ్మచెట్టు నీడ నిలిచిన నరునకు
మండుటెండఁ గాఁగు మానవునకు
స్థిమితమందు మనసు సమమౌను బాహ్యాన విశ్వ॥

పుట్టి డాముదమునఁ బొర్లాడినను దన
కెంత యతుకఁ దగునొ యంతె యతుకు
తొంటి నోముఫలము కంటె నెక్కుడు రాదు ॥విశ్వ॥

కం॥ కడు కష్టమ్మైన నైనను
బుడమిఁ బ్రతికి చెడినవాని పొంతకరుగుటె
యొడఁదకు సుఖమిడు నెన్నఁడుఁ
జెడి బ్రతికినవాని చెంతఁ జేరకు వేమా!

ధర్మమెఱుఁగకుండఁ దనవారికే కీడు
సలుప మూర్ఖపరుల చంకఁ జేరు
కొయ్యచెట్లఁ గొట్టి గొడ్డట దూఱదా ॥విశ్వ॥

పట్టి విద్దె నొజ్జ కొట్టిన మాత్రాన
ముప్పదేమి మనసు నొప్పి యేల!
చేదుకట్టు వలనఁ జేలంబు చెడునొకో ॥విశ్వ॥

వానవచ్చు రాకఁ బ్రాణముచను పోక
నెవ్వఁడైన ముంద యెఱుఁగఁ గలఁడ
హరుని మహిమ దెలియ నరుని తెలివి యెంత ॥విశ్వ॥

కొన్ని వేళలందుఁ గ్రూరుఁడు దశవెల్గ
సజ్జనుండు చాల సంకటపడు
రాముఁ డడవిపాలు రావణుఁ డిల నేలు ॥విశ్వ॥

చేతమొక్క జాయి చేనిమొక్కల జాయి
వేఱయనుట వట్టి వెఱ్ఱిగాదు
కవలకుండకున్న కాశింత భేదంబు ॥విశ్వ॥

పాలపండ్లు వేఁప పండ్లొక్కటిగ నుండు
తినినయంత రుచుల తీరు వేఱు
నరులయందు మంచి నరులట్లు తెలియుము ॥విశ్వ॥

అంతరాత్మకంటె అధిక గురుఁడు లేఁడు
సతికి మించినట్టి సఖుఁడు లేఁడు
దానమునకు సరి నిధానము లేదురా ॥విశ్వ॥

ఒక్కఁడున్న మనసు చక్కఁగా నిలుచును
ఇద్దఱున్న సుద్ది పెద్దదియగు
మంది యెక్కువైన మఠమునకే చేటు ॥విశ్వ॥

ఎంత నీచమునకు నేనియు బాల్పడు
వాని బ్రతుకు బ్రతుకె వసుధయందు
సిగ్గుకొఱక చీర శృంగారము కొఱక ॥విశ్వ॥

అధముఁడైనవాని కప్పిచ్చి యడిగిన
దెబ్బలాడు గాని, డబ్బు నీఁడు
సొమ్ముపోయి కడకు దిమ్మువట్టును సుమ్ము ॥విశ్వ॥

చలనచిత్రచయము చక్క నాడెడి వేళ
మూఁగబొమ్మలాట ముదమొదవదు
పాయసమ్ముకంటె వరికూడు రుచియౌనె ॥విశ్వ॥

గ్రామమందొకండు కలుషాత్ముడుండిన
గ్రామమెల్లఁ జెఱచుఁ గల్లగాడు
చెడ్డకోఁతి దాన చెఱచురా వనమెల్ల ॥విశ్వ॥

నీతిబోధ వినక నిత్యమ్ము మనసులో
కల్మషంబు పోదు కడుగకున్న
పాత్రకైన లోన పాచి పట్టునుగదా ॥విశ్వ॥

దారిఁ జూపు గురుఁడు దనరు నిచ్చెనవోలె
బట్టుఁబట్టి నీవ చెట్టునెక్క
అమృతఫలము నంది ఆనందమొందుము ॥విశ్వ॥

కామ మనఁగ వేఱ కడలి కవ్వల లేదు
నీ మనస్సునంద నిలిచి యుండు
కామముడిపి ముక్తి కాంత చెంతను జేరు ॥విశ్వ॥

పెద్ద వృక్షమునకుఁ పిన్న ఫలంబులు
పిన్న తీఁగ కింత పెద్ద పండ్లు
హానికల్గకుండ బూనఁ జేసిన దేవఁడు. ॥విశ్వ॥

తోఁడి మానవునకుఁ దోడ్పడుచుండిన
శ్రీఘవుండు మేలు సేయు నీకు
పాదు నీళ్ళుపోయ పైనుండి ఫలములు ॥విశ్వ॥

అనతికాలమంద అభ్యుదయము పొంద
నరుగు యువజనాళి కడ్డమగుట
పరుగువాఱు కాళ్ళ బడితెను దూర్చుట ॥విశ్వ॥

పర్వతమ్మునందుఁ పరమాణువందును
చీమయందు ఘోర సింహమందు
నిండియున్నవాఁడు తండ్రి దేవుఁడె గదా ॥విశ్వ॥

శౌండికు కరమందు నుండు పాలపిడత
కల్లుముంత యనుట కల్లగాదు
సానియింటి చాన సతియని యందురా ॥విశ్వ॥

గిల్లి జగడములనె మెల్లప్డు కూర్చెడి
మనుజుఁ డొక్కఁడున్న మనసు చెడును
ఇంటి కింతకంటె తంటాలు లేవురా ॥విశ్వ॥

చేతులార నీవు చేసికొన్నది గాక
కర్మ ఫలము వేఱె కలుగఁ బోదు
ద్రుపద సుతకు నృపతి తొడసూప తొడవిర్గె ॥విశ్వ॥

మనసు తనదు కోలఁది మఱచి సమాధిలో
బ్రహ్మాయంతు దెలియఁ బయనమగుట
ఉదధి లోతు గనుట కుప్పు బొమ్మరుగుట ॥విశ్వ॥

వర్షమంతలేని వర్షాన నష్టపు
మెట్టపంట కొంత నట్టువడును
నీటిమీఁద పంట నిర్భాగ్యునకుఁ బండు ॥విశ్వ॥

వలయు రీతి నాడ వాక్స్వేచ్ఛ నరికట్టి
పాలనమున సభ్య పదవి నిడుట
పీడిఁ జేసి పెద్ద పెండ్లముం గట్టుట ॥విశ్వ॥

నరులు విడుచుగాలి తరులు పీల్చందగుఁ
దరులు విడుచుగాలి నరులకుఁ దగుఁ
బ్రకృతి మర్మ మరయఁ బరమాద్భుతంబురా ॥విశ్వ॥

సంఘసేవ సేయఁ జనుదేర వలెనన్న
ఓర్పుకొనుట ముందు నేర్పుకొనుము
లోతునీళ్ళ దాట ఈఁత కావలెగదా ॥విశ్వ॥

చిక్కుమందు నున్న చెక్కెఱ పొట్లమ్ము
బొక్క చీమ కెవఁడు చక్కఁ దెలిపె
నిత్య మహిమగాక నిస్తంత్రి యున్నదా! ॥విశ్వ॥

కామతృష్ణ తగిలి కలఁచెదేని మనస్సు
రెచ్చగొట్టు నిన్ను ఱేపుమాపు
జిలకు గోకకొలఁది జిలబొబ్బ రేగదా! ॥విశ్వ॥

పాడి వీడి పేనవ్రిజ గొట్టుకొని తిని
చివఱ కష్టదశకు చిక్కు నసలు
వెల్లువఁ బడిపోవు పిల్లులవలె నుందురి ॥విశ్వ॥

ఆడుదాని మాట ఆపదలకు బాట
మంచిగురుల మాట మణుల మూట
అంతరాత్మ మాట అమృతంపు టూటరా! ॥విశ్వ॥

తనకుఁ బెఱకు హాని దవుటూహా జనియింప
అపుడ అణఁచి మేలు నందవలయు
పుట్టగానె దూడ గిట్టలు దీయరా! ॥విశ్వ॥

ఆలి నణఁపలేక అప్పు తీర్పఁగలేక
ఎన్న వెరుక ముందు ఎవరు లేక
విసివి యొక్కకండు వేదాంతివలె నుండు ॥విశ్వ॥

కలమతంబులన్ని గాలించి చూచిన
సరమె మనకు బోధ పఱపఁ జూచు
గతులు వేఱుగాని గమ్య మొక్కటె గదా ॥విశ్వ॥

మాటలాడకున్న మౌనినాఁ జెల్లిన
అమితమూకఁ దపసి యనఁదగుఁగద
మాటలాడకున్న మనసాడకుండునా ॥విశ్వ॥

లోతు లెఱిఁగి పసుల గోతఁ ద్రోసెడి ధూర్తు
చేరనిచ్చి గుట్టు చెప్పుటన్న
దారిదొంగకుఁ దన ధనము జూపినయట్లు ॥విశ్వ॥

ఏన్గు నెక్కుచుండు నినునితో మావటీఁ
డతని కితఁడు సాటి? హారుతలఁ గల
యుడుపతి సరియౌనె యుమ్మెత్త యటనున్న ॥విశ్వ॥

చర్మ శుద్ధియగును స్నానమ్ము చేసిన
గీము శుద్ధియగును గోమయమున
ఆత్మ శుద్ధియగును అచలబోధసుధను ॥విశ్వ॥

అనిలమావిరున్న అగపడదెప్పుడు
కాని, ఘనము గాగఁ గానఁబడును
పుణ్యఫలము గూడ పూర్తియైననె తోఁచు ॥విశ్వ॥

ఆత్మ నెఱిఁగి దైహి కాశ వీడినవాఁడు
పుట్టఁబోఁడు జగతిఁ గిట్టఁబోఁడు
పొట్టుతీయ గింజ మొలకెత్తఁ జాలునా? ॥విశ్వ॥

చిమ్మ్రవాఁడు గూడ సింహాసనం బెక్కఁ
గోరుఁ, గాని కోర్కె తీరు టెట్లు ?
దుడ్డు దొఱకఁ గలదె తెడ్డంత సులువుగా ॥విశ్వ॥

మాట కోటదాట మన సిల్లుదాటని
ఉత్తరుని కరాన కత్తియుంట
పేడివాని మూతి పెనుమీస మున్నట్లు ॥విశ్వ॥

ఉన్నదాని యునికి ఉండక తప్పదు
లేనిదాని యునికి లేదు జగతి
దేహ మస్థిరంబు దేహి సుస్థిరమగు ॥విశ్వ॥

దప్పి దీరకున్న తాపంబు పుట్టును
కోర్కె దీరకున్న కోప మొదవు
ఆశ దీరకున్న అవని జన్మము గల్గు ॥విశ్వ॥

తెలిసి చేసిన మఱి తెలియక చేసిన
పాపఫలము పొంద వలయుఁ బ్రాణి
శిశువు నిప్పు దాక చే కాలకుండునా? ॥విశ్వ॥

కులధర్మము నశియించిన
కులకాంతల వర్తనమ్ము కుటిలమ్మయి దు
ష్ఫలితమ్ము నిచ్చుఁ గావునఁ
గులధర్మము వీడుటెంత ఘోరము వేమా !

త్రిగుణ రహితమైన దివ్య తత్త్వముఁ బొంది
పాప పుణ్యములను వదలు యోగి
సుజనుఁ డతఁడె గాన సుఖదుఃఖములు లేవు ॥విశ్వ॥

అన్ని తెలిసిగూడ అజ్ఞానమునఁ బడు
ఘనులు కొందరుంట కల్లగాదు
గాధిసుతుఁడు మేనకకుఁ జిక్కి పోఁడే ॥ విశ్వ॥

బలవిహీనులైన పలువు రేకమైన
భీమబలు జయింప వీలు గలుగు
గట్టివెంటిగనయి కరిని బంధింపదా ॥విశ్వ॥

చిలుక కీఁకరంగె శ్రీరామ రక్షయా
కమఠమునకు రక్ష గట్టి బొచ్చె
సజ్జనునకు సత్య శాంతమే రక్షణ ॥విశ్వ॥

కోణములను జెక్కి రాణించు రతనము
పుటముఁ బెట్టఁ బైడి పొలుపు హెచ్చు
కష్టములకు నోర్వ ఘనుల కీర్తి వెలుంగు ॥విశ్వ॥

ముకుర తలము మురికిఁ, బొగ నిప్పు, మావినే
గర్భమందు శిశువు గప్పఁబడిన
గతిని గప్పఁబడును గామముచేఁ దెల్వి ॥విశ్వ॥

శీతకాలమందు స్వేదరంధ్రమ్ములు
ముడుచుకొనుట జెమట వెడలనట్లె
ఆత్మతత్త్వమంద కనుమానములు పోవు ॥విశ్వ॥

తగనివేళ తాను తన యంగములనెల్ల
కూర్మమెట్లు ముడుచుకొనునో యట్లు
విషయలోలత విడి విమలాత్ముఁడౌ జ్ఞాని ॥విశ్వ॥

నల్లకుండలోని తెల్ల యన్నము వలె
దేహమాత్మనుండు తెలిసికొన్న
ఒకటి యస్థిరమగు ఒకటి స్థిరమ్మగు ॥విశ్వ॥

ముందు పోవువాఁడు మొనగాఁడునాఁడగు
వెనుక పోవువాఁడు ఘనుఁడుగాఁడు
స్థాపకుని యశంబు దక్కునా పెఱిలకు ॥విశ్వ॥

సూర్యరస్మి రోగ సూక్ష్మజీవులఁ జంపు
ఔషధంబు సరగ వ్యాధిఁ జంపు
అంతరాత్మ బోధ మఘములఁ జంపురా ॥విశ్వ॥

గాజు కవఁదెసకుఁ గాంతి పోవఁగఁ జాలు
జాతి కవలిదెసకు రాఁగలదొకొ
మంచిమాట మూర్ఖు మనసున దూఱునా ||విశ్వ||

చావశిశువు, మంత్రిసాని కట్నము పోదు
రోగిచావ, వెజ్జుకో తొలగదు
సిద్ధి కాఱిపోవ జీతము కాఱునా ||విశ్వ||

పందెమందుఁ జేరి పరుగెత్తు వారల
నితరు లురక ప్రోత్సహించునటుల
కలలు శకునములును గర్తను బురికొల్పు ||విశ్వ||

కంచుకోట యున్న ఘనరక్షణం బున్న
శత్రు లున్న పతికి శాంతి సున్న
లోనలేని శాంతి లోకాల దొఱకునా ||విశ్వ||

మాట మాట కలియ మనసులు సరియగు
మాట మాట కలియ మనసు కలియు
మాట మనసు కలియ మంచి మైత్రి ఘటిల్లు ||విశ్వ||

అనికిఁ దోడుకొనఁడు అసహాయశూరుండు
చలికిఁ దోడుకొనవు సరిగఁ శాలు
మనసు తోడుకొనదు ఘనయోగనిష్ఠలో ||విశ్వ||

మాట కంచుకోట మాట ముక్తికి బాట
మాటమాట పెంచి మాటఁ దెచ్చు
మాట నేర్వమి నవమానము సిద్ధము ॥విశ్వ॥

చంద్రలోక యాత్ర సాగించినంతనే
ఇంద్రభోగ మనుచు నెంచనేల ?
నరకమునకుఁ ద్రోయు నైతిక పతనంబు ॥విశ్వ॥

ఆత్మయందు బుద్ధి అతికిపోయిన యంత
ఆత్మగుణము బుద్ధి కంటుకొనును
జలము పాలలోన కలిసిన రీతిరా ॥విశ్వ॥

ఇంద్రియములు గొప్ప యెన్న దేహముకంటె
వానికంటె మనసు దానికంటె
బుద్ధి; దానికంటె శుద్ధాత్మ గొప్పది ॥విశ్వ॥

దండి సత్యమునకు రెండు నాల్కలు లేవు
పాపమునకు గుండె బలము లేదు
దైవసేవ కెపుడు తఱుగింతయును లేదు ॥విశ్వ॥

సున్న ముందు నొకటి యున్న సంఖ్యగ నగు
ఒకటి తొలఁగ బిందు వొకటి నిల్చు
ప్రకృతి తొలఁగ నిల్చు పరమాత్మ యొక్కటే ॥విశ్వ॥

ఇరుగు చల్లనంచుఁ బొరుగు చల్లనంచు
దీప మిడిన యంత దేవుఁ గొల్వ
వానివలన నిన్న దైవము దీవించు ॥విశ్వ॥

౪౦॥ ఒకరికి సాయము చేయుచు
నొకరివలన సాయమంది యోర్పునేర్పులం
బ్రకటించుచు సకలార్థము
లొకటొక్కటి సరగ సాధు వొందును వేమా.

లక్ష్యశుద్ధి లేక లక్ష్మి చేకూరదు
చిత్తశుద్ధి లేక శివుని గనఁడు
శుద్ధి లేక మందు సుగుణంబు నిచ్చునా? ॥విశ్వ॥

ప్రతిసుఖ మొక చువ్వ ప్రతిదుఃఖ మొక చువ్వ
అవియు పంజరమ్ముగ నమరియుండ
చిల్కవోలె నాత్మ చిక్కి యుక్తిని బాయు ॥విశ్వ॥

శాస్త్రబద్ధమైన చక్కని పాలన
వాస్తవిక విఘాత పథముఁ జనక
ప్రజల జీవితంపుఁ బ్రతిబింబ మగుటొప్పు ॥విశ్వ॥

ఎచట నుద్భవించి యెటుఁ బ్రవహించినఁ
గడకుఁ జేరు నదులు కడలి; నట్లె
ఈశుఁ జేరు నెవ్వఁ డెట్లు ప్రార్థించిన ॥విశ్వ॥

ఔర్వ శిఖల వేడి యగుటెఱుంగని వార్ధి
గడ్డి నిప్పుచేతఁ గ్రాగనట్లె
ఖలుఁడు సేయునింద కలఁచదు బుధు మది ॥విశ్వ॥

ఆదియందు నాట అంత్యమందు సురట
అనుటఁ దెలియకుండ ఆడు టన్న
గణగుణ మఱియకయు కైత సెప్పిన రీతి ॥విశ్వ॥

పెండ్లిగొండ్లి గాదు పెయ్యేండ్ల పంటౌట
నౌకరి మంచిచెడ్డ లొకరు తెలియ
నాడు తెగడి వంట ఏడు చెప్పుల జోళ్ళు ॥విశ్వ॥

పరమ నిర్మలాత్మ బాహ్యేంద్రియమ్ముల
లోఁగియూఁగుఁ దనదు లోతు మఱచి
మద్యమానినట్టి మనుజుని రీతిగా ॥విశ్వ॥

కర్మ కల్పితమ్ము కాయమ్ము తత్కర్మ
మంతరింప నొక్క యాత్మ నిలిచి
పరితపించుచుండు పరమాత్మఁ జేరఁగ ॥విశ్వ॥

ఒకటి కానిసైన ఒక టధికారియై
మనసు తనువు రెండు మసలుచుండు
మనసు కానిసైనఁ గన లేవు బ్రహ్మము ॥విశ్వ॥

కంటిపాప లేని కనులున్న ఫలమేమి!
మనసు నిల్పలేని మౌనమేల!
గుణము శుద్ధిగాని గురువేల గురుతేల! ॥విశ్వ॥

పంటచేని పైకిఁ బశువుఁ దోలెడివాఁడు
పశువుకంటె హీన పశువు గాఁడె!
పంటకుప్పకగ్నిఁ బఱపువాఁడెవఁడురా ॥విశ్వ॥

మచ్చుతునకవంటి మనుజుఁ డొక్కఁడు చాలు
వంగడంపుఁ బేరు వసుధ వెల్గ
జలధిపేరు నిల్ప చంద్రుఁ డొక్కఁడె చాలు ॥విశ్వ॥

ఆత్మ గతము గాన సాధ్యమై సంస్కృతి
తనువుకంటె ముందుఁ దనరునట్లు
పరుష సరళములకుఁ బరగు బిందువు ముందె ॥విశ్వ॥

అగ్నిపుటము గొన్ని అచలాపుటము గొన్ని
సూర్యపుటము గొన్ని శుద్ధియగును
అట్లె మనుజ తత్త్వ మరసి మంచికిఁ ద్రిప్పు ॥విశ్వ॥

పావకోళ్ళు దొడిగి పచ్చడమును గప్పి
కుండలములు పెట్ట గురుడు గాఁడు
అంబు బట్ట నంద అర్జును లగుదురా! ॥విశ్వ॥

చింతపండు పెట్టి చేతికొలందిఁ తోమ
పుత్తడిత్తడి జిగి పొల్చు సరిగ
హెచ్చులొచ్చు లెఱుఁగ బచ్చు గావలెఁగదా ॥విశ్వ॥

బాహ్యావర్తనంబు బాగుగా లేదేని
మనసులోని నడక మంచిదగునె ?
వంట నేర్వకున్న వైష్ణవం బబ్బునా ? ॥విశ్వ॥

సత్య శాంత సహిత శమదమాన్వితమైన
విమల మనసునుండి వెడలు మాట
మలిన రహితమైన వెలిసైకతపు టూట ॥విశ్వ॥

ఒక్క తనువునుండి యుద్భవించినవయ్యు
కుడి యెడమలకింత నుండు తేడ
ఎడమచేతఁ బెట్ట నెవరైన మఱతురు ॥విశ్వ॥

కం॥ స్వామ్యమసామ్యము గమ్యము
సామ్యమ్మని యనుటెగాని జరుగదు ప్రకృతిన్
సౌమ్యముగ విమర్శించిన
కామ్యంబది యెల్లలోక కళ్యాణంబే .

కం॥ టక్కరి యక్కఱ దినముల
నెక్కడ నక్కనను వచ్చి యీశుఁడవనివే
చక్కఁగ నక్కఱ దీఱిన
నక్కఱ కంతునకు నైన నడ్డము తగులున్.

కొమ్మ గొలుసు లేని గొప్ప యూయెలవయి
రూప నామ మహిమ రూఢిపడక
ఊఁగుచున్న యట్టి ఉత్తముఁ డెవఁడురా ॥విశ్వ॥

ప్రళయ కాలమందు బ్రాణుల హరియించి
నిల్పి కుక్షిఁ దిరిగి సల్పి సృష్టి
కర్మగతిని ద్రిప్పు గారడీ డెవఁడురా ॥విశ్వ॥

ప్రతిపదంబు వాడి వ్యర్థము గాకుండ
గతిని గలుగఁజేయుఁ గవివరుండు
వైద్యుఁ డెఱఁగి గుణము ప్రతిమొక్క వాఁడఁడా? ॥విశ్వ॥

రెండు వైపులందు నుండిన సౌజన్య
మలరు మైత్రి; రెంటఁ దోలఁగనేని
కుడియెడమల మూఁత కొఱతైన మద్దెల ॥విశ్వ॥

సౌజన్యము సౌశీల్యము
రాజిలు రమణీయ రమణి రంజితపతియై
పూజితపథమున భర్తకు
నోజం బొనగూర్చి రాజయోగిం జేయుఁ.

పెట్టిపుట్టినాఁడు పుట్టిపెట్టినవాఁడు
ముందువెనక భోగ మందగలరు
లేనివాని కెపుడు లేవురా భోగముల్ ॥విశ్వ॥

నీవు నీవువైపు నెమ్మదిగాఁ బ్రాకుఁ
దల్లివైపు బిడ్డ తరలిపోవు
భక్తి గలుగు నాత్మ పరమాత్మఁ జేరురా ॥విశ్వ॥

సాధుజనుల సేవ సన్మార్గముల త్రోవ
దైవసేవ ప్రకృతి తరణ నావ
ఆత్మతత్త్వ సేవ అచలసిద్ధుల కోవ ॥విశ్వ॥

పరమహంస వగుట భక్తితో మ్రొక్కఁద
యోగశక్తిఁ దోడ నొక్కమాఱు
దేవదేవుఁ జూడ దివ్య దీవన లిమ్మ ॥విశ్వ॥

కం॥ వందనము జగద్గురునకు
వందన మఖిలాండకోటి భరితాత్మునకున్
వందనము మోక్షదాతకు
వందన మఘహారునకనుచు వాకొను మనసా!

ఒకరు నీకు నెద్ది యొనరింప వనరెదో
ఆచ్చరింపఁబోకు నద్ది పెఱకు
అన్నిధర్మము లిందు అమరియున్నవి సుమ్ము ॥విశ్వ॥

దాస్యమునకు విద్య దారి తీయఁగరాదు
వృద్ధి పొందవలయు వృత్తివిద్య
శుభము లెసఁగ జనులు సుఖముండ వలయురా ॥విశ్వ॥

అని తన పలుకుంబడులను
దన కప్పంజెప్పు నన్ను దయమాన పెలో
కనములఁ గనుఁగొని నవ్వెన్
మునిచంద్రుం డతని కర్థిమ్రొక్కె నంతన్.

"భవబంధము లూడునిఁకన్
కవి శుభమస్తు"నుఁడు సెలవుఁ గైకొని మోద
మ్మువురోత్తుఁ బయనమైతిని
కవిరాజుల రాజకవులఁ గనుఁగొను వేడ్కన్.

అష్టోత్తరము సహస్రము
సుష్టుగ రచియించి బండ్ల సుబ్రహ్మణ్యుం
డష్టైశ్వర్య ప్రదుఁడగు
సృష్టికళాకర్త కిచ్చి యెంతయు నలరెన్.

మంగళమ్






# తప్పొప్పుల పట్టిక

| పుట | తప్పు | ఒప్పు |
|---|---|---|
| 11 | బిన్వ్రులు | బిందువుల్ |
| 12 | సౌహార్ద్రి | సౌహార్ద్ర |
| 12 | పిడిగ | విడిగ |
| 24 | భావింతు | నీవెంతు |
| 47 | పెద్దపెద్ద | పెదపెద్ద |
| 56 | ధీరపురుప | ధీరపురుష |
| 57 | తత్ఫము | తత్ఫలము |
| 59 | తగిరిన | సాగిన |
| 72 | జక్కు | జిక్కు |
| 74 | విశ్వశించు | విశ్వసించు |
| 75 | యతని | యాతని |
| 83 | గడలు | గడ్డలు |
| 88 | మినీషి | మనీషి |
| 89 | చేసే | చేసె |
| 103 | నుత్సవిగ్రహాలె | ఉత్సవప్రతిమలె |
| 111 | కుండిలు | కుండలు |
| 111 | మను | మగును |
| 113 | క్తి | శక్తి |
| 120 | పరులు | పసులు |
| 123 | శాపురము | శాఫురము |
| 134 | నలితి | నతిథి |
| 127 | దలంచు | దలఁచు |
| 129 | రూపిజయము | ముజ్జగాల |
| 135 | కమ్మిచ్చు | కమ్రుచ్చు |